# సత్యహరిశ్చంద్రీయము





గ్రంథకర్త:

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు




పబ్లిషర్సు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్స్

ప్రొప్రయిటర్సు:

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

1942 హెచ్చింపు 0-4-0




1—2—0

0-2-0

శ్రీ

# సత్య హరిశ్చంద్రీయము

(ఆఱంకముల నాటకము)



రచయితలు:


## బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు

(శ్రీ బుద్ధిమతీవిలాసము, సాత్రాజితీయము, ఉత్తరరాఘవీయము
మున్నగు నాటక కర్తలు)



తొమ్మిదవ కూర్పు : 1000 ప్రతులు

ప్రకటనకర్తలు:

కురుకూరి సుబ్బారావు అండ్ సన్

ప్రొప్రయిటర్సు: సరస్వతీ బుక్ డిపో

హెడ్డాఫీస్ : బెజవాడ    బ్రాంచి : రాజమండ్రి




హెచ్చింపు 0-4-0


1942




[ వెల రు 1-8-0

హెచ్చింపు 0-2-0

# ఈ నాటకమున వచ్చు పాత్రములు

## పురుషులు

దేవేంద్రుడు
వసిష్ఠుడు
విశ్వామిత్రుడు
నారదుడు
బృహస్పతి
అగస్త్యుడు
గౌతముడు
హరిశ్చంద్రుడు
సత్యకీర్తి
నక్షత్రకుడు
సూతుడు

లోహితాస్యుడు
పింగళకుడు } పౌరులు
రోహణకుడు } పౌరులు
రైభ్యుడు
భేతాళుడు
కాలకౌశికుడు
కేశవుడు
జనార్దనుడు
వీరబాహుడు
పరమేశ్వరుడు

సూత్రధారుడు, కంచుకి, వందిమాగధులు, భటులు గొందఱు వత్తురు.

## స్త్రీలు

చంద్రమతి
మాతంగకన్యలు

కాలకంటకి
పార్వతి

---

## హెచ్చరిక

శ్రీ ర స్తు

# సత్య హారిశ్చంద్రీయము

## ప్ర థ మాం క ము

### నాం ది

మ॥ ననవిల్తుండు చలంబునన్ బయిఁబయి ♦ న్మాతంగకన్యాదిలో
కనసమ్మోహనబాణ మేసినను, న♦క్షత్రేశుఁ డా మీఁదఁ జి
క్కని రేయెండల గుప్పుచున్నను, దదే♦కధ్యానవిన్యస్తచిం
తన మై మాఱని రాజశేఖరుతపో♦నైశ్చల్య మేలున్ మమున్.

గీ॥ భువనకారణ మీశ్వరు,♦మూర్తి యేది
ఆస్తికనియాధి కెయ్యది ♦ యాదిమూల
మఖిలధర్మంబులకు నేది ♦ యాటపట్టు
అట్టి సత్యంబె యందఱ ♦ నాశ్రయించు.

[నాంద్యంతమున]

సూత్రధారుఁడు—అహో! యేమి నాపుణ్యము! నిరంకుశనాటకాలంకారసాహితీరససరోనిమజ్జనసముజ్ఝితమనఃకలంకు లగు నీ పరిషజ్జను లే కెలంకులఁ జూచినఁ దామయై నాటకభవన మలంకరించిరి. ఇంకను మారిషుఁడు ప్రవేశింపకున్నాఁ డేమి?

మారి—[ప్రవేశించి] బావా! వచ్చితి [నలుదిక్కులఁ బరికించి] అయ్యా! నేఁ డేదియో నాటకప్రయత్నమువలె నున్నది. రంగమంతయు యథావిధిగా నలంకరింపఁబడినది

అదియుంగాక,

చ॥ అలకలు దిద్దువారు, జడ♦యల్లికలన్ విరజాదు లుంచువా
రలు, వదనమ్ములన్ గరగ♦రన్ జికిలీ రొనరించువారు, మైఁ
గలప మలందువార, లవి ♦ గా వివి యంచును మార్చిమార్చి భూ
షల నిడువారు నై గుజగు♦జన్ జనుచుండిరి సర్వసాంఘికుల్.

సూత్ర—ఏమోయీ! నేఁ డుదయంబునఁ జేసిన ప్రకటనము నీ వెఱుంగవా యేమి?

మారి—ఏ మని యా ప్రకటనము?

సూత్ర—ఏ మనియా? ఆంధ్రదేశమునఁ జాలకాలము పేరు ప్రఖ్యాతి గాంచిన గుంటూరు హిందూనాటకసమాజముచే మొన్న మొన్నటివఱకు పెక్కుసారులు ప్రయోగింపఁబడి నేఁడు సర్వజనాదరణీయమై యత్యంతనీతిదాయకమై యొప్పుచున్న సత్యహరిశ్చంద్రీయనాటక మిచ్చట నీ రాత్రి ప్రదర్శింపఁబడు" నని.

మారి—ఇది మన లక్ష్మీకాంతకవి రచించినదే కద!

సూత్ర—అవును.

మ॥ నరవిక్ బుద్ధిమతీవిలాసము, హరిశ్చంద్రీయముల్, శ్రీమదు
త్తరరామాహ్వయనాటకంబు, నల సత్రాజిత్సుతోద్వాహముల్
స్థిరపుణ్యప్రదముల్ రచించె నతఁడే ; దృశ్యప్రబంధోరువై
ఖరిఁ గేల్మోడ్చి పురాతనాధునికరంగత్సత్కవిశ్రేణికిన్.

(నేపథ్యమున)

మ॥ క్రతువుల్ పెక్కు లొనర్చినన్, నిరతముల్ , గంగాదిపుణ్యాపగా
తతులన్ మున్గిన, గోశతంబులను సద్ధాత్రీసురశ్రేణి క
ర్పితముల్ చేసినఁ జెందవచ్చునె? బలారీ! నిత్యసత్యవ్రత
స్థితుఁ డార్జించు సుపుణ్యకీర్తులను గొంచెంబేని నెవ్వానికిన్.

సూత్ర—(ఆకర్ణించి) అతఁడె నీతోడియల్లుండు వసిష్ఠుండై వర్తించుచున్నాఁడు. మన మింక సముచితసంవిధానంబున వర్తింతము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.



[ రంగము — సురసభ ]

(పిమ్మట వసిష్ఠ విశ్వామిత్ర నారదాది ఋషులతోడను బృహస్పతితోడను దేవేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వసి — మ॥ క్రతువు ల్వెక్కు లొనర్చినన్ (అను పూర్వోక్తపద్యము పఠించుచున్నాఁడు)

దేవేం — మునిజనగరిష్ఠా! వసిష్ఠా! సత్యవ్రతమును గుఱించి చక్కఁగా వక్కాణించిరి.

వసి — దేవేంద్రా! వేపల్కు లేల? సత్యంబు పరబ్రహ్మస్వరూపంబు గాన నద్దాన సకల ధర్మంబులు సకలసత్కర్మంబులు నెలకొనియుండు. అద్దాని ప్రభావంబున నే పరమేశ్వరుండు జంగమస్థావరవిశిష్టంబైన భువనంబుల సృష్టింపను బెంపను హరియింపను సమర్థుఁడయ్యె. మఱియు వికల్పశూన్యంబైన యమ్మహామహుని సంకల్పం బయ్యదియే కాన,

శా॥ సత్యంబే సకలార్థసాధక మగున్, సత్యస్థిరుం డొందు నౌ
న్నత్యం బెల్లెడలందు, సత్యమున కన్నన్ మిన్నయౌ ధర్మముల్
స్తుత్యంబుల్ మఱి లేవు, సత్యమె ఫలించున్ నాఁటికిన్ నేఁటికిన్
సత్యాలాపి యొకండె నిత్యుఁడు, ప్రపంచస్థాయి సత్యంబగున్.

కావున సర్వధా సత్యనిష్ఠ యనుష్ఠేయంబు; సత్యవ్రతం బాచరణీయంబు. ఎట్టి కష్టకాలంబునందైన సత్యంబు విడువకుండిన నయ్యదియే కడ కతని నుద్ధరించును.

బృహ — బాగు! వసిష్ఠా! బాగు!

అగస్త్యుఁడు — వసిష్ఠా! ధర్మపథన్యాసంబైన నీ యుపన్యాసంబు సమంజసముగా నున్నది.

నార — మైత్రావరుణీ! అతిమాత్రంబైన నీవాఙ్మాధుర్యము శ్లాఘాపాత్రముగా నున్నది.

గౌతముఁడు — బ్రహ్మర్షిసత్తమా! బ్రహ్మణ్యుండవైన నీవు వచించినదంతయు యథార్థము.

విశ్వా — (స్వగతము) ఛీ! స్వర్గమునకు వచ్చినను నొడియేకులు దప్పలేదన్నట్లిక్కడను నా వసిష్ఠుఁడే దాపురమయ్యెను. ఈతండు నోరు మెదలించిన మాత్రంబున నీ జన్నిగట్టుఁదపసులెల్ల బట్టులచందంబున శ్లాఘించుచుందురు. నాహృదయమున కిప్పుడు చిచ్చుముట్టించిన ట్లున్నది. ఏదో యొక కారణము కల్పించుకొని చీఱిపోరాటము వెట్టికొని యీతనికి నేఁడే భంగియైన శృంగభంగము చేయకమానను.

నార — (స్వగతము) వసిష్ఠ విశ్వామిత్రు లిరువు రొక్కచోఁ గూడియుండుటచే నీ సభ నా కిప్పుడు కన్నుల పండువుగా నున్నది. ఇక్కడ నిప్పుడు చక్కని కలహము

కావున శుక్రునివాక్యములు నిరర్థకములుగాని మునిజనగరిష్ఠుండైన వసిష్ఠునివికావు. లభింపవచ్చును. విశ్వామిత్రునికిఁ గొంచెము పురిపెట్టి చూచెదను. [ప్రకాశముగా] విశ్వామిత్రా! ఈ వసిష్ఠుని యుపన్యాసంబు నీ కేమియు రుచించినదికాదా యేమి? మాటాడక కూరకుంటివి.

విశ్వా—(అపహాస్యముగా) నిరర్థకమైన యీతని యుపన్యాసంబునకు మీరందరు సంతసించితిరిగదా! చాలు.

వసి—ఏమీ! విశ్వామిత్రా! నా యుపన్యాసంబు నిరర్థకమా?

విశ్వా—ఆహా! ముమ్మాటికి నిరర్థకమే.

వసి—ఎందుచేత ?

విశ్వా—ఎందుచేతనా? నోటికి వచ్చినట్లు పెక్కుధర్మంబు లుపన్యసింపవచ్చు. అయ్యవి లోకములం దాదరణలోనికిఁ దేవలయు. ఆదరణమునకుం బనికిరాని నీ ధర్మశాస్త్రంబు లెందులకు? ఎల్లవారు సులభముగా నాచరణమునం దుంచుకొనుటకై సత్యవ్రతమును గురించి శుక్రుఁ డెట్లు చెప్పినాఁడో చూడు.

వసి.—ఎట్లు చెప్పినాఁడు ?

విశ్వా—

"గీ॥ వారిజాక్షులందు • వైవాహికములందు
ప్రాణవిత్తమాన • భంగమందు
చకిత గోకులాగ్ర • జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము • వొందదధిప!" అని.

ఇదియే సమంజసముగా నున్నది. ఎట్టియిక్కట్టులందైన సత్యంబు విడువగిట్ట దని నీ వొక్కఁడవు వక్కాణించిన మాత్రంబున నొక్కం డక్కరణిం బ్రవర్తించువాఁ డుండఁడు.

దేవే—కుశికనందనా! నీయుక్తి యుక్తియుక్తముగా లేదు. ఏల యన శుక్రుని ధర్మశాస్త్రమువలన నవసరము వచ్చినపుడెల్ల నబద్ధమాడవచ్చు నని తేలుచున్నది. ఒక్కని సౌశీల్యాదిగుణంబులఁ బరీక్షింపవలసినసమయ మాతని యిక్కట్టులయందుఁగాని సౌఖ్యములందుఁ గాదు. ఆపత్కాలంబునఁ జలింపనివాఁడే ధైర్యవంతుఁడు. ఎట్లన—

గీ॥ సరసులగు పండితుల విమ • ర్శనములెల్ల
గడచినదె పద నిర్దుష్ట • కావ్య మగును;
తన కళత్ర సుత ప్రాణ • ధనము లడఁగు
సమయమున నిల్చియున్నదె • సత్యనిష్ఠ.

విశ్వా—ఓహో! నూతనముగా నీ వొక్కఁడవు ధర్మశాస్త్రవేత్త వున్నాఁడ వని నాకిది వఱకుఁ దెలియదు.

దేవే—గాధేయా! నీవు చక్కఁగా నాలోచింపుము. పోనీ, వసిష్ఠుండు నుడివిన ధర్మశాస్త్ర మాచరణమునం దుంచుకొనినవాఁ డెవ్వఁడైన నున్నాఁడేమో యీ సభ్యుల నడుగుదము. మునివృషభులారా! మీరు త్రికాలవేదులుగదా! ఏ లోకంబునఁగాని యెప్పుడుగాని;

మ॥ తనసామ్రాజ్యము పోవనీ, స్వకులకాంతారత్నముం బాయనీ,
ధనమానంబు లడంగనీ, పరిబలశాంథల్ తన్ను బాధింపనీ,
తనయుం డీల్గిన నీల్గనీ, యనఘసత్యస్థైర్యముం బాయకుం
డిన పుణ్యుండు త్రిలోకగణ్యుఁ డొకఁడేనిం గల్గినం దెల్పుఁడీ!

(ఋషు లందఱు నాలోచన నభినయించుచున్నారు)

నార—(లేచి) తాపసోత్తములారా! నిరుత్తరులై కూరుచుందు రేమి? ఎంతకాల మాలోచించెదరు?

శా॥ పైనే మున్నది? చెప్పుమో శుకుఁడ!; విశ్వామిత్ర! నీ కింతసే
పా; నిన్నే! వచియింపుమో కలశజా!; యాలోచనల్ పాలుపో
వా? నీకైన మతంగ!; గౌతమ! యిదేలా చెప్పరాదా?; వసి
ష్ఠా! నీ వొక్కఁడవే సమర్థుఁడవు లెమ్మా పేరు వోనీకుమా!

(వసిష్ఠుఁడు లేచి కంఠము సవరించుకొనుచున్నాఁడు)

విశ్వా—(స్వగతము) మే మందఱము మూర్తీభవించిన తపోగ్నితేజఃపుంజములవలె నిక్కడఁ గూరుచుండఁగా మమ్మందఱ నధిక్షేపించిన ట్లహంభావమున నీవసిష్ఠుఁడు మరలఁ దానే యేదియో చెప్ప సాహసించుచున్నాఁడు. ఇప్పుడు నిశ్చయముగా మాకుఁ గోపకారణము కలిగినది.

నార—(రహస్యముగా) విశ్వామిత్రా! నీవు ముందుగా లేచి మాట్లాడవైతివి. ఇప్పుడు నీవైరి వసిష్ఠుఁడే నీవు చెప్పినదంతయుఁ బూర్వపక్షము చేయఁబోవుచున్నాఁడు. ఇందున నీకుఁ బరాభవము రాకమానదు.

విశ్వా—ఏమీ! మాకా పరాభవము! (హుంకరించుచున్నాఁడు) అతఁడు చెప్పినదంతయు నబద్ధమని నే నిప్పుడు సిద్ధాంతము చేయుటకు సిద్ధముగానే యున్నాఁడ. చెప్పుని ష్మ.

వసి—దేవేంద్రా ! నీ వడిగిన ప్రశ్నంబునకు నేను దైవసాక్షిగా నుత్తరం బిచ్చెద. మునీంద్రులారా ! ఆకర్ణింపుడు. కలదుగదా, భూసతీతిలకంబునకుఁ దిలకాయమానం బగు నయోధ్యాపురవరంబు. అందు,

శా॥ చాతుర్వర్ణ్యవిధానముల్ నడుపుచున్ ♦ సత్యంబు, ధర్మం బహిం
సాతత్త్వాదిగుణంబులన్ ప్రజల యా♦చారంబు శాసించి, వి
ఖ్యాతశ్రీ ధర నేలువాఁ డఖిలదీ♦నానాథరక్షాదిద
క్షాతాత్పర్యదయాతిసాంద్రుఁడు హరి♦శ్చంద్రుండు నిస్తంద్రుఁడై.

అతం డొక్కఁడే త్రిభువనంబుల సత్యసంధుఁడు.

విశ్వా—(స్వగతము) ఈతండు మాసాటి రాచపట్టి యగు త్రిశంకుపట్టిని సత్యమూర్తి యని వర్ణించుచుంట నాకుఁ గర్ణరసాయనము గానే యున్నదిగాని, యేది యెట్లున్నను నాను గర్భశత్రువుం డగు నీ వసిష్ఠుని పక్షమును నేను పూర్వపక్షము చేయవలసినదే కాని యంగీకరింపరాదు. కావునఁ బోరాటంబున కిట్లుపక్రమించెదఁ గాక ! (ప్రకాశముగా) వసిష్ఠా ! నీ వెవ్వనినో సత్యమూర్తి యని పేర్కొంటివి. మేము పరాకునఁ జక్కఁగా వినమైతిమి. మఱల నొక్కమాఱు పేర్కొనుము.

వసి—ఒక్కమాఱు గాదు, ముమ్మాఱు పేర్కొనియెద. హరిశ్చంద్రుండు, హరిశ్చంద్రుండు, హరిశ్చంద్రుండు !

విశ్వా—(కోపముతో) ఓరీ ! వసిష్ఠా !

సుగంధివృత్తము—రాగము—కీరవాణి, తాళము—రూపకము.

చాలు కట్టిపెట్టు మీ పి♦సాళిపల్కు రచ్చలో
కూళ ! మెత్తురే ? ధనంబు ♦ కోట్లు నీకు నిత్తురే !

వసి—ఏల హుంకరించె దిప్పు ♦ డేమి తప్పు వచ్చెరా !
కాలుఁద్రవ్వి కయ్యమాడఁ♦గాఁ దలంచినాఁడవే ?

విశ్వా—పోలసట్టిమాడలాడఁ♦బోలునే ? మదాంధులా
ఆ నరుల్ నృపాధముల్ దు♦రాత్మ ! సత్యసంధులా ?

వసి—పేలరీ ! త్రిశంకుపట్టి ♦ పృథ్విరాజమాత్రుఁడా !
పాలితప్రసిద్ధసత్య♦వాక్పవిత్రగాత్రుఁడే !

విశ్వా—వసిష్ఠా! చాలు నీవాచాలత్వము. పాపాకరంబగు మర్త్యలోకంబున నుగ్గుఁబాలతోఁగూడ దుష్కర్మంబులయం దారితేఱిన రాజకులమునం దొక్కండు సత్యసంధుఁడు గలఁడని సిద్ధాంతీకరించుచున్నావు గా? తరతరంబులనుండియు నతని యింటఁ బురోహితత్వంబుఁ జేయుచుఁ బొట్టపోసికొనుచున్నందుల కా హరిశ్చంద్రునిపై నీకీ యభిమానమా! "విన్నన్న చెప్పినదే వేదము" అన్నట్లు నీవు చెప్పిన దెల్లనా రంగీకరింతురను దురభిమానముచేఁ గాఁబోలు, కానిదాని కైనదాని కందరికంటె ముందుగాఁ గాలు దువ్వుచున్నాఁడవు. ఛీ! ఛీ! భూతభవిష్యద్వర్తమానకథావిదు లగు నిట్టి తపోధనులచేత నిండియుండిన యీ దేవసభామధ్యంబునఁ ద్రిలోకములఁ దన యాజ్ఞచేతియం దిడుకొని, సహస్రనేత్రములచేతను సమస్తలోకవిషయములం గనిపెట్టుచు నన్నిటికి సాక్షిభూతుం డైన యీ దేవేంద్రునితో నక్కఱకుమాలిన పెద్దతికము పై వేసికొని యిట్టి మృషాలాపములాడుట కిప్పుడు నీ మెడమీఁది కేమి కత్తివచ్చినది? ఎవ్వరికిం దెలియని యాహరిశ్చంద్రుని సత్యసంధత నీకొక్కనికిమాత్రమే తెలియుటను నీమొగమున నే ప్రొద్దువొడిచిన దేమి? హరిశ్చంద్రుఁడఁట! సత్యసంధుఁడఁట! తా నెఱుఁగునఁట! సభ్యులారా! వినుఁడి. భ్రష్టా! వసిష్ఠా!

మ॥ నడలుం జక్కిలముల్ ఘృతంబు పెరుగుం • బాల్మాంసఖండంబు ల
ప్పడము ల్కుత్తుకబంటిగాఁ దిని సురా•పానక్రియన్ మత్తులై
చెడి తబ్బిబ్బులఁగూయురాజు లెచటో • చింతింప సత్యం బెటో
జడుఁడా! నీగగనప్రసూనకథలన్ • జాలించి నోర్మూయుమా.

దేవేంద్రా! మునీంద్రులారా! ఈదుష్టవసిష్ఠుండు హరిశ్చంద్రుండు సత్యసంధుండని కంఠము చించుకొనుచుఁ దన కల్లపగ్గియాలం బ్రకటింపఁగూసిన దురాలాపంబుల మీరు విశ్వసింపకుఁడు. లోకంబుల నిక్కువంపు సత్యశీలుం డెవ్వఁడును లేఁడను మాట నిస్సందేహము. నిర్ధారణము. నిశ్చయము. (కూరుచుండును)

నార—(స్వగతము) విశ్వామిత్రుఁడు బాగుగా రేఁగినాఁడు.

వసి—ఛీ! విశ్వామిత్రా! అపాత్ర!

మ॥ చెడుగా! యింకను మానవైతివి పర•శ్రేయోసహావ్యాపృతిన్
దుడుకుంబోకల నిన్నుఁబోలు దురితా•త్ముల్ వ్రేసవే లా నృపున్
గడుదూషించినఁ దద్యశోంకమునకున్ • గానున్న దే నింద్యమా
సడి! మత్తాళి త్యజించినన్ గొఱతయే • సంపెంగ నెత్తావికిన్.

ఓరీ! దుర్మతీ! ఇప్పటికిని నీనైసర్గికదుస్స్వభావము మానినదికాదే! ఆత్మస్తుతియుఁ బరనిందయుఁ దుర్జనసులభంబులని తెలిసియు నట్టి నీచగుణంబులనుండి నీచిత్తంబుఁ దొలంగఁజేయలేక పెనగులాడుచున్న నీతపం బేల, కాల్పనా? సభయం దార్యు లడిగిన ప్రశ్నంబునకుఁ బ్రత్యుత్తరంబు తెలిసియుండియు నుచితభంగి నెఱుంగఁజేయ కున్న నరకప్రాప్తి కలుగు నను ధర్మశాస్త్రవిధుల ననుసరించి, సకలలోకవిదితంబై సమస్త సురమునివర్ణనీయంబై, యనన్యసామాన్యంబై విడంబించు నెవ్వాని నిత్య సత్య సౌశీల్యంబు ముజ్జగంబులకు నొజ్జబంతి యనఁదగునో, యట్టి సత్యకీర్తి హరిశ్చంద్రచక్రవర్తిం గురించి, యున్నవాస్తవమును నించుకయైన మిగిలి వర్ణింపక యీ సభయందు నేను వక్కాణించుమండ నిర్హేతుకంబుగా నేల కయ్యమునకుం గాలుద్రవ్వెదవు? ఇచ్చటి సభాసదులెల్ల వీనుదోయిళ్ళం దాగ్రివు నాతని సత్యకథా సుధారసంబు నీకు నొక్కనికిమాత్రము విషప్రాయ మయ్యెనేమి? మూఢా! ఊరక లేనిపోని పెత్తనములఁ బైవేసికొని, నేనును నొక ఋషినే యనుకొనుచు మాయందఱిలోఁ దలనెత్తికొని తిరుగఁగలిగిన నీ కున్న యీకొంచెపు మర్యాదఁగూడ నేల చెడఁగొట్టుకొనియెదవు? ఊరకుండుము.

విశ్వా—ఛీ! పాపిష్ఠా! వసిష్ఠా!

ఉ॥ ఒక్కనృపాధమాధము మదోద్ధతుఁ బేర్కొని సత్యమూర్తి యం
చిక్కడఁ బెద్దజేసి నుతియించుచుఁ గాదనువారినెల్ల మ
త్తెక్కినమాటలాడుచు భళీ! నిరసించెదవా? వసిష్ఠ! నీ
టక్కరికూత లానృపుకడం బ్రకటింపుము పొట్టనిండెడున్.

దురాత్మా! అసంబద్ధప్రగల్భా! నీచరాజాభిమానీ! లోకాతీతవిషయంబుల నిశ్చయంబులని రాయి గ్రుద్దుచుఁ గాఱుఁగూఁతలు గూయుచున్న నీకు నేఁడు వాగ్బంధనము కావలసినదే. దుర్మతీ! వాతాతపవర్షంబుల కోర్చి త్రిలోకభయంకరంబగు తపోనియతిచే ఘోరాత్మునంతవానిలోఁ గొన్న నాతపంబు నే కాల్చునంతటిమహర్షినైతివిగా! బ్రహ్మబంధుఁడా! నాకుఁ గొంచెపు మర్యాదయేమి? దేవేంద్రుఁ డడిగినదే తడవుగా నిక్కడనున్న మునిబృందారకులందఱికంటె నగ్రేసరుండవైనట్లు ముందుగా బయలు దేరి నీకున్న పురోహితత్వపు మర్యాదను బదువురలోఁ బ్రకటించుకొన్న నీ తెలివి కందఱు సంతసించినారులే. ఓరీ! ఆత్మశ్లాఘపరాయణా! యీ దేవేంద్రుఁడైనను నిక్కడివార నందఱ నడిగెఁగాని నిన్నొక్కని మాత్రము బొట్టును గాటుకయుఁ బెట్టి పేరంటమునకుఁ బిలిచెనా? వీరందఱకుఁ దెలియని విషయము నీకుమాత్ర మెట్టు దెలియునో? చూడు.

సీ॥ బడబానలముతోడఁ • బాథోధు లొక్కగ్రు
క్కనఁ గొన్న ఘనుఁ డీ య•గస్త్యుకన్న
ముక్కంటి నెదిరించి • ముంగాల సెగకన్నుఁ
బూనిన యీ భృగు•మౌనికన్న
కినిసి యీ దేవేంద్రు • తనువెల్ల వేగను
ల్మలచిన యీ గౌత•మమునికన్న
సృష్టికిం బ్రతిసృష్టిఁ•జేసి సీతలదన్ని
బ్రహ్మీభవించిన సు•ప్రథితుఁడైన
ఈ కుశికనందనునికన్న • నెందు నీవు
పెద్దవో ముందుఁ జెప్పు మీ • సుద్దు లేల?
వేల్పుఁబేరోలగమునమై • విఱచికొనుచు
పద్దులాడఁగనే నీవు • పెద్దవైతే.

చాలు! చాలు. నోరుమూయుము. పాపము, కంఠశోషఁబడి యాఱచితివి. కొంచెము వాక్పరిశ్రాంతికై యింత కమండలూదకమునైనఁ బుచ్చుకొనుము.

నార—(వసిష్ఠునితో రహస్యముగా) వసిష్ఠా! అధికప్రసంగియైన యీవిశ్వామిత్రునినోటి కొక్కమారు తాళము వేయలేవుగా?

వసి—ఈదుర్మార్గుని ప్రేలనిమ్ము. వీని లెక్క సేయువా రెవరు? గంధసింధురము రాజమార్గమునఁ బోవుచుండఁ గుక్క లెంత మొఱిగిన నేమి?

నార—(ప్రకాశముగా) వసిష్ఠా! ఆతని విషయమై నీవు నాతోఁ బ్రసంగింపకుము నే నేమో తనపైఁ గొండెములు చెప్పుచున్నట్లతండు తలంచు. (రహస్యముగా) దుష్టున కెప్పుడు దూరముగానుండుట మంచిది. (ప్రకాశముగా) నాకు మీరిరువురు సమానులే!

విశ్వా—ఏమీ నారదా! స్తుతిపాఠములచేఁ బొట్టవోసికొను నీతని నాతో సమానము చేయుచున్నావు. నేను నిరంకుశమైన తపోమహిమచేఁ బ్రకాశించుచున్నాను గాని యీతనివలె నొక నీచక్షత్రియాధముని ముఖస్తుతులు చేయుచు ధనము సంపాదించుచుండలేదు.

వసి—ఓరీ! ఆత్మశ్లాఘీ! మన మన తపోమహిమంబుల తారతమ్యంబులు సమస్తలోకంబులవారికి విదితములే. ఊరక నీగుట్టు నీవే త్రవ్వుకొనకుము. భ్రష్టా! తొలుత

నీతపోనిష్ఠాభ్యసనంబునకు ముఖ్యహేతుభూతుండ నగు నన్ను నీవు గురుభావంబున మన్నింపక నిందించినపాపము చాలక, దుర్గుణాధికు లగు నీవంటివారికిఁ బదిమందికి బుద్ధిసెప్పఁదగిన యాహరిశ్చంద్రుని సహితము దూషించుచున్నా వేమిరా? ఛీ! ఛీ! నీజన్మమువలన క్షత్రియకులమొక్కటియే కాక తపోధనజనంబు సహితము కళంకీభూతమగుచున్నది కదరా?

విశ్వా—ఓరీ! బ్రాహ్మణాధమా! అశేషవస్తుజాలంబుల సృష్టింప రెండవబ్రహ్మనైన నేనురా నీకు శిష్యుండను? వింటిరా సభాసదులారా! ఈదురాత్ముని యధికప్రసంగములు! మీకును నీదేవేంద్రునకును రుచ్యములుగానుండిన నుండుఁగాక! మాకు మాత్రము మహానింద్యములుగాఁ దోఁచుచున్నవి.

నార—విశ్వామిత్రా! ఈవృథావాగ్వ్యయముతో నేమి ప్రయోజనము? ఈవసిష్ఠుండు సత్యసంధుఁ డని వర్ణించిన యాహరిశ్చంద్రుని బొంకించునంతటి సమర్థత నీకుఁ గలదు నున్నచో ముందునకు వచ్చి నిలువఁబడుము.

దేవేం—(స్వ) ఓహో! యీ నారదుఁడు కలహమును మఱింత పెంచుచున్నాఁడుగదా!

విశ్వా—నారదా! నీవు చక్కఁగాఁ జెప్పితివి. వసిష్ఠా! నీకును నాకును నీవృథాకలహముతోఁ బనిలేదు. నీ మాటల మేము నమ్మఁజాలము. నీహరిశ్చంద్రుని సత్యస్ఫూర్తి నేఁ బరీక్షింతు. పట్టువట్టి కపటంబులఁజొట్టి ధైర్యముఁజోఁగొట్టి యారాపట్టిని నెట్టులైనఁగావలసినన్ని బొంకు లాడింతు. ఏది! పందెమేమిటైనఁ జెదవో ముందునకు రమ్ము. (అని లాగుచున్నాడు)

నార—వసిష్ఠా! చెప్పుము. నీ వీ సమయమున వెనుకంజ వేయరాదు.

వసి—ఓరీ! అపాత్రా! విశ్వామిత్రా! ఏటికీ దుర్ఘటమైన కార్యముఁ బూనెదవు.

గీ॥ ప్రళయనిర్ఘాత మరచేతఁ ♦ బట్టవచ్చు
హేమశైలంబుఁ గొనవ్రేల ♦ నెత్తవచ్చు
దివిని భూమిని రెంటి సం♦ధింపవచ్చు
ధర హరిశ్చంద్రు బొంకింపఁ ♦ దరము కాదు. మఱియు,

శా॥ పారావారము లింకనీ, కులగిరి♦వ్రాతం బిలన్ డొల్లనీ,
తారాసంఘము డుల్లనీ, త్రిభువన♦ధ్వంసంబు చేకూఱనీ,

గౌరీశభ్రుకుటీనిరీక్షణమహోగ్రజ్వాల చల్లారనీ,
యా రాజేంద్రుఁ డబద్ధమాడునె? దురాత్మా! యేటికీ బింకముల్.

కానీ, నీకర్మంబు నీ వనుభవింపక తీరదు. సభ్యులారా! ఈధూర్తుండు తా హరిశ్చంద్రుని బొంకించెద నని పంతములాడుచు నా పన్నిద మపేక్షించుచున్నాఁడు. కాన నిదే నాప్రతిజ్ఞ మీరంద ఱాలింపుఁడు.

మ॥ శిరమెల్లన్ గొరిగించుకొంచు స్వతపశ్శీలంబులన్ మాని, సా
టిబుధుల్ ఛీ! యని సిగ్గులేని పరిపాటిన్ గల్లుపెల్లానుచున్
నరుపున్కన్ ధరియించి, యుత్తరదిగంతప్రాప్తి కూరేగెదన్
ఖరవాహంబున వాడవాడలును నాతస్మానాథుఁడే బొంకినన్!

[పురేపురే యని సభ్యులు కరతాళంబులఁ జేయుచున్నారు.]

విశ్వా—సభ్యులారా! యేటికీ కాకిగోల? ఒక్క క్షత్రియాధముని బొంకింప నింత రాద్ధాంతసిద్ధాంతములు కావలయునా? ఈ మూఢుఁడు ప్రజ్ఞకై పెనఁగులాడుచున్నాడు గాన నాపన్నిద మిదే వినుండు. నే నాహరిశ్చంద్రుని బొంకింప లేనిచో,

మ॥ హిమశైలంబున వాయుభక్షణుఁడనై మృత్యుంజయుంగూర్చి ది
వ్యమతిన్ జేసిన మత్తపఃఫలమునం దర్ధాంశమున్ ధారవో
సి, మహిన్ బెక్కు మహాయుగంబు లమితశ్రీమీఱ నేలించి, స్వ
ర్గమునం దీ సురరాజపీఠమునఁ దద్రాజోత్తమున్ నిల్పుదున్.

దీనికిఁ దప్పిన నే నాపరమేశ్వరుపాదంబులకుఁ దప్పినవాఁడ నగుదు. కావున వసిష్ఠా!

శా॥ పోరాటం బిఁక నేల? నీయెదుటనే బొంకింతు నీచేని నేఁ
డే. రా పోద మయోధ్యకుం గదలి; పో,నీ, నీవు మున్ముందుగా
నా రాజన్యున కేమి సెప్పికొనెదో యా నీతులన్ జెప్పికో,
మ్మే తేపే చనుదెంతు మించినది లే దీ రేపటన్ మాపటన్.

వసి—ఓరీ! జడమతీ! తొలుత నాయిలచేని నలువ సత్యమూర్తిగ సృష్టించియుండ నే నతని కిప్పుడు చెప్పవలసిననీతు లేమున్నవి? వెకలీ!

గీ॥ పూవు పుట్టినతోడనే, తావి గొలుపు
సద్గుణపుఁ జిన్నె లట్టులే • సజ్జనులకు
విసము పుట్టినతోడనే • పొసగు చేదు
దుర్గుణపుఁజిన్నె లట్టులే • దుర్జనులకు.

విశ్వా—ఈ డాంబికపువచనంబుల కేమిలే! నీకు గర్వభంగమగుకాల మాసన్న మైనది. తొందరపడకుము!

దేవే—ఏమి! విశ్వామిత్రా! నీవు మగల గలహము పెంచుచున్నావు? నీ ప్రయత్నమునీవుండక ప్రయోజనముమాలినమాటలతో నీకేమిపని? ఇప్పటికైన శాంతింపరాదా?

విశ్వా—(కోపముతో) ఏమోయి! ఇంద్రా! మే మందఱము నిన్నొకదొడ్డఁజేసి యీ చింతామణిపీఠంబున నుంచినందులకా నీ కింత కావరము? నీకు సురాధిపత్యము దొఱకిన దని పొగరుచే గ్రుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినచందమున మాకే యెదురు తిరుగ సాగినావుగా? దేహమెల్లఁ గన్నులమయ మైనను నీయధికారగ మెంతనఱకో రిమిలుంగనైతివి.

సీ॥ గౌతము పడిపంచ, గాచి యద్దమరేయిఁ
"గొక్కొరోకో" యని • కూసినపుడు
రాకాసిమూఁకల•ధాకకుం భయమంది
గుంటగుంటల నీరు • గ్రోలినపుడు
పక్కితేనికి సుధా•భాగధేయము నిచ్చి
బ్రతికింపు మని కాళ్ళఁ • బడినయపుడు
బ్రహ్మహత్యాదోష•ఫల మంది నహుషుచే
స్వారాజ్యమును గోలు•పడినయపుడు
ఇట్టి నీయధికార మే • గట్టుఁ జేరె
మఱపువచ్చెనె యింతలో • మఘవ! నీకు
నమమ సిరి వచ్చి కలిసిన • వెడఁగుబుద్ధి
యర్ధరాత్రంబు గొడుగు తెమ్మనక యున్నె?

ఓరీ! స్వాధికారగర్వోన్మత్తవ్యర్థప్రలాపీ! నీ కీ యధికారము శాశ్వత మని తలంచుచున్నావా యేమి? నీ వీ చింతామణిపీఠంబున కర్హుఁడవు కావని మాచిత్తమున కెప్పుడు తోఁచినదో యాక్షణంబ నీవు నీమూట ముల్లెఁ జంకఁ బెట్టుకొని కాననిక్రంతలకు "ఆ

లో లక్షణా" యని లేచిపోవలసినవాఁడవే. నీ ప్రతాపములు నాముందు గాదు. నోరుమాలిన యీ గౌతముకడ సాగింపుము.

గౌత—ఆహా! యీ దుర్మార్గుం డిందు వసిష్ఠులనేగాక నన్నును దూషించుచు నాగుట్టు బయలు వేయుచున్నాఁడు. నే నిక్కడ నుండరాదు. (నిష్క్రమించును)

దేవే—అకటా! దుష్టులకు హితము దెలిపినను నహితమై తోఁచుఁగదా!

నార—బృహస్పతీ! ఈ విశ్వామిత్రుడు మన దేవేంద్రుని నిందించుచుండ నీవు గూడ నోరుమాలినవానివలె నూరకుండుట యుచితమా ?

బృహ—విశ్వామిత్రా! నీకు మతిపోయినదా యేమి? యందఱ దూషించుచున్నావు.

వసి—ఆచార్యా! ఈ మూర్ఖునితో నీ కేమి పని?

బృహ—ఔను! గయ్యాళి పెండ్లము నెట్లు త్యజింపవలయునో యీలాంటి దుష్టులతో వాదముగూడ నట్లే త్యజింపవలయును.

విశ్వా—ఔనోయీ! నీచవసిష్ఠదురభిమానీ! ఈలాటి నీతులు స్వవిషయమునందు నీకుఁ బనికిరాక పోయినవి.

అగ—విశ్వామిత్రా! మన మిఁకఁ బోవుదము. బృహస్పతీ! ఇంద్రా! వసిష్ఠా! పొండు. (విశ్వామిత్రుని దీసికొని పోవుచుండ)

విశ్వా—వసిష్ఠా! ఆడిన పందెము తప్పిపోవుగదా!

వసి—సూర్యచంద్రులు గతులు తప్పినను తప్పను.

విశ్వా—అట్లయినఁ బద. (నిష్క్రమించుచున్నాఁడు)

దేవే—ఆచార్యా! పోవుదము రమ్ము. నేఁడు నిష్కారణకలహముతో సభ ముగిసి నందులకుఁ జింతించెద.

(అందరు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.



శ్రీరస్తు

# సత్య హరిశ్చంద్రీయము

## ద్వితీయాంకము

(ఆలోచన మభినయించుచు విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

దుర్ఘటమైన కార్యము పై వేసికొన్నందుల కనివార్యంబుగా దాని నిర్వహింపవలయును. ఇందు నాకు జయమా పరాజయమా యని ముందు యోజించెద. (ఆలోచించి) హరిశ్చంద్రుండు నా మాయాజాలంబులఁ బడక యబద్ధమాడకున్నను సాటి రాచపట్టి సత్యకీర్తి ప్రపంచస్థాయిగా నిలుపఁ గారణమైతి నను సంతసంబే నాకు జయం బగు. బొంకినా వసిష్ఠున కున్నంత సంకటము నాకు లేదు. అయినను [గర్వముతో] విశ్వామిత్రుఁడ నగు నాకుఁగూడ నపజయభయ మేటికి ?

మ॥ క్రతుభుక్సంతతితోడఁ బోరి, సురలోకం బొందు గల్పించి, ది
వ్యతపశ్శక్తిఁ ద్రిశంకు నం దునిచె నే, భవ్యుండు, ప్రాక్సృష్టికిన్
బ్రతిసృష్టిం ఘటియించి బ్రహ్మపద మే రాజర్షి సాధించె, న
ట్టితపోరాశి తలంప వాని కవె వాటిల్లున్ జయారంభముల్.

కావున నే నిప్పుడు హరిశ్చంద్రుని యాస్థానమునకే పోయెదను. [గర్వముతో నిష్క్రమించుచున్నాఁడు.]

ఇది విష్కంభము.



(పిమ్మట హరిశ్చంద్ర సత్యకీర్తులు తగిన పరిజనులతోఁ బ్రవేశించుచున్నారు)

వందిమాగధులు - కవిరాజవిరాజితము [గేయము, బేహాగ్, ఏకతాళము]

జయము నిరత్యయ సత్యనిధీ! రిపు•జాలభయంకరదివ్యరథీ!
జయము చతుర్నిగమోక్తవిధీ! సువి•శాలదయాత్తమనశ్శరధీ!
జయ మినవంశపయోధిమణీ! విల•సత్క్రమవిక్రమభాద్యమణీ!
జయము త్రిశంకుకుమారమణీ! స్వభు•జాయుగహారిధరారమణీ!

హరి— సత్యకీర్తి ! మనరాజసూయాధ్వరంబు చక్కఁగనే నెఱవేఱెనది. కాని పూజ్యుఁడైన విశ్వామిత్రమహర్షి దయఁజేయకుండుట కొంత కొఱఁతగానే యున్నది.

సత్య— రాజేంద్రా ! లౌకికులవలె వనౌకసులగు మునిజనంబు లాచారభంగమున కోర్వరు. అందుచేత వా రాశ్రమము విడిచి రావీలులేక యుండియుండవచ్చును.

భద్రుఁడు—(ప్రవేశించి) దేవా ! విశ్వామిత్రమహర్షి వచ్చుచున్నాఁడు.

(హరిశ్చంద్ర సత్యకీర్తులు వారి కెదురేగుచున్నారు)

(పిమ్మట యథోక్తముగా విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విశ్వా—(హరిశ్చంద్రుని జూచి తనలో) ఆహా ! యీ పురుషసింహుని తేజోమూర్తి సర్వదా రమణీయము గదా!

చ॥ పరిచితమయ్యె నాకుఁ గదు•బాల్యమునుండియు, సుప్రసాదవి
స్ఫురితము, రాజలక్షణవి•శుద్ధకళాకలితంబు, సత్యసు
స్థిరమహిమాభిరామము, సు•ధీగుణవంతము, ధీరశాంత మీ
నరవరమూర్తి కన్పడు క్ష•ణక్షణ మొక్కొకవింత పొల్పునన్.

హరి— బ్రహ్మర్షిసత్తమా! నమస్కరించుచున్నాఁడ. దేవర! ఈమణిపీఠం బలంకరింపుఁడు.

విశ్వా—ఆయుష్మాన్ భవ! (స్వగతము) యీతఁడు నన్ను యుక్తముగానే సంబోధించినాఁడు. (విశ్రమించును)

హరి— దేవా ! ఇంతకుముందు దేవరవిషయమే ప్రసంగించుచుంటిమి.

విశ్వా—(స్వగతము) సురసభావృత్తాంత మీతని కప్పుడే తెలిసినదా యేమి ?

హరి—మునీంద్రా ! భవద్దర్శనంబున ధన్యుండనైతి. ఆశ్రమము నిరపాయముగా నుండి తపోనుష్ఠానంబులు నిర్విఘ్నముగాఁ గొనసాఁగుచున్నవికదా! మఱియు,

మ॥ తరుసంతానము కోరినప్పుడు సము ♦ ద్యద్వల్కలల్ గూర్చునే?
ఝరు లచ్ఛోదకసంభృతిన్ ద్రిషవణ ♦ స్నానార్థమై యుండునే?
నిరతంబున్ దనుయాత్రకై దొరకునే ♦ నీవారధాన్యంబు? సు
స్థిరహోమాగ్నిప్రదక్షిణార్చ్చల శుభా ♦ ప్తిన్ వెల్గునే నిత్యమున్.

విశ్వా—కేవల ధర్మస్వరూపుఁడవు నీవు భూమండలంబుఁ బరిపాలించుచుండ మునిజనంబుల తపంబులకు నే కొఱఁతయు నెట్లగు?

హరి—దేవా! మీతపశ్శక్తియే నన్నీ ధర్మమునుండి కాపాడుచున్నది.

విశ్వా—హరిశ్చంద్రా! నీవలన నాకుఁ గొంత ధనసహాయము కావలసివచ్చిన దోయీ!

సత్య—ఋషులలో నగ్రగణ్యత వహించుటకు రాజ్యవిభవంబులనయితము తృణప్రాయముగా విసర్జించిన మీకుఁగూడ ధన మేల కావలయు?

విశ్వా—పరమేశ్వరప్రీతిగా నే నిప్పు డొకయాగము ప్రారంభింపనెంచినాను. దానికై—

హరి—ఆలాగైన మీచే వైవస్వతవంశము చక్కఁగా ననుగృహీతమయినది. మునిచూడామణీ! మీకుఁగావలసిన విత్త మెంత?

విశ్వా—మిక్కిలి స్వల్పము. నీవంటివారి నడుగఁదగినది కాదు.

హరి—ఆర్యా! ఎంతైన నేమి?

గీ॥ పాత్రదానంబు సుంతైన ♦ ఫలము గాంచు
ఫలము లేదెంత యిడిన న ♦ పాత్రమునకు
మంచినేల నాటిన గింజ ♦ మ్రానుగట్టు
చవిటినేల నశించు గిం ♦ జయును నపుడె.

కావున వలయుద్రవ్య మెంతయో సెలవిండు. కృతార్థుఁడ నౌదు.

విశ్వా—హరిశ్చంద్రా! నీవు మాకు స్వతంత్రుఁడవు కావున వినుము.

కం॥ దంతావళముపయిన్ బల
వంతుం డొక్కండు నిలిచి ♦ పైకిని రతనం
బెంతటిదవ్వుగ రువ్వునొ
యంతపొడవు ద్రవ్య మిత్తు ♦ వా సరిపోవున్.

హరి—వలసినంతఁ గొనిపొండు. నేను దాతగను, మీరు పరిగ్రహీతలుగను నుండుటకన్న మిన్నయగు పున్నెము నా కింకేమి కలదు?

శా॥ లెక్కింపన్ భరమా తపోధనము క ♦ ల్మిన్ బూర్ణులౌ మీర లీ
రొక్కం బిప్పుడు నన్నుఁగోరుట జగ ♦ ద్రూఢంబుగా మద్యశం

బెక్కింపక దలపోసి కావలయుఁ; గాఁ, దే న్మాటలోఁ దెచ్చి మీ
ప్రక్కన్ జక్కఁగ లేఁడు నిల్పఁడె నమో, వాకంబులోఁ బెన్నిధుల్.
దేవా ! ధన మిప్పుడే వేసడంబులపైఁ గట్టి మీవెంటనే పంపివేయుదు.

విశ్వా—వద్దు, వద్దు. మా కవసరమైనప్పుడు మేమే వచ్చి కొనిపోదుము. అందనుక నీ కోశంబునందే భద్రపఱచి యుంచుము.

సత్య—ఆర్యా! మీధనము మీకడనే యుండుట శ్రేయము.

విశ్వా—[స్వగతము] ఏ మిది? యీతఁడు నాపన్నియత్నమును గుర్తెఱింగినట్లే మాటలాడుచున్నాఁడు. [ప్రకాశముగా] సత్యకీర్తీ! మీధనముతోఁబాటు దీనిని గూడఁ గాపాడుట కష్టము కాదుకదా!

హరి—ఆర్యా! కాపాడుట కష్ట మని కాదు.

చం॥ మునివర! లోకమెల్ల ధన,మూలము గాన ననారతంబు త
జ్జనులు పరార్థసంగ్రహణ,సాధనము ల్వరికించుచుండ్రు; నం
దనునయినన్ స్వమాతనయి,నన్ సతినైనను గన్నతండ్రినై
నను దుదిఁ బ్రాణమిత్రు నయి,నన్ ధనమందున నమ్మవచ్చునే ?

విశ్వా—హరిశ్చంద్రా ! నీయందు నా కట్టిసందేహము కలుగునా ?

హరి—మునీంద్రా ! ఎప్పటి కట్టివాని కట్టిబుద్ధిపుట్టు టెవ రెఱుగుదురు ?

సత్య—మునీంద్రా ! మహారాజుగారు విచారింపక మాటలాడలేదు.

విశ్వా—అలాగైన నేనా విచారింపక మాటలాడినది ?

సత్య—అయ్యో ! నే నట్లు పల్కుదునా ? కాని మీయాశ్రమమునందు దీని మీ రేల దాఁచుకొనరాదు ;

విశ్వా—ఇప్పుడు నీవుమాత్రము విచారించి మాటాడితివి కాఁబోలు ! ఓయి ! అహాయి కుఁడా !

మ॥ అకటా! భద్రముసేయు మా కచటఁ గొం,పా! గోడియా! యెప్పు డూ
రక నేత్రంబుల మూసి నిశ్చలతపః,ప్రారంభుఁడై యుండు మహా
నికడన్ దక్కునె సొత్తు? దొంగ లెపుడే,నిన్ దాని నాశించి దోఁ
చుకొనన్ జేయున దేమి! దాఁచుకొన న,చ్చోఁ బెట్టెయా బేడయా!

సత్య—దేవా ! నిరంతరమైన మీ తపశ్శక్తియే మీకు సర్వసాధనము కదా!

విశ్వా—ఓహో! నేఁటికి మీకిచ్చిన యీమూఁడుగవ్వలకై మాతపశ్శక్తినిఁగూడ వ్యయపఱచుమనుచున్నావు గా? అలాగైన నొక్కమాఱు నీయమని చెప్పుఁడు పోయెదను.

హరి—ఆర్యా! క్షమింపుఁడు. మీయిష్టానుసారమే కానిండు.

విశ్వా—అలాగైనఁ బోయివత్తును.

హరి, సత్య—(నమస్కరింతురు)

విశ్వా—(పోవుచుఁ దనలో) ఇప్పుడు హరిశ్చంద్రుఁడు నాచేఁ జిక్కినాఁడు. ఇంక నీతని నెట్లయిన నా యాశ్రమమునకు వచ్చునట్లు పన్నుగడఁ బన్నవలయు. అందులకై క్రూరమృగంబుల నిదివఱకే సృజించితిఁగదా! ఇంక నితఁడు నా కెట్లు లోఁబడఁడో చూచెద. (నిష్క్రమించును)

హరి—సత్యకీర్తీ! వాగ్దత్తమైనధన మప్పుడే యమ్మహర్షికిఁ జెందియుండినచో మన భారము తగ్గుచుండును. ఇప్పుడు చిత్తమునకు లేనిపోని సంకటము సంభవించినది.

సత్య—పరధనము విషప్రాయముగా నెంచు మీకే సంకటములు రావు. (ప్రక్కఁజూచి) ఎవఁడో సత్వరముగా వచ్చుచున్నాఁడు.

(పటాక్షేపముగాఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు)

కంచు—దేవా! దేశమున కేదియో ప్రళయము సంభవించినది.

హరి—ఓయీ! అప్రియముఁ జెప్పుచున్నావు.

కంచు—నాయనగారూ!

గీ॥ త్వద్భుజారక్షితద్వీప • ధాత్రియందు
ధర్మ మెల్లెడఁ నాల్గుపా • దముల నడువ
సంభవించెను నేఁటికి • క్షణములోన
జనవరేణ్యా! విశ్వామిత్ర • సరణి యేదో.

సత్య—చెప్పవలసినది స్పష్టముగఁ జెప్పక మఱింత సంకటపెట్టుచున్నావు.

కంచు—అయ్యా! పట్టణజనపదవాస్తవ్యు లగు జనులు తమకష్టములఁ జెప్పికొన ద్వారమున వేచియున్నారు.

హరి—వారిని సత్వరముగాఁ బ్రవేశపెట్టుము.

(పిమ్మటఁ బౌరులు ప్రవేశించుచున్నారు)

పౌరులు — బాబూ ! దండము లండి.

త్రిభంగివృత్తము [గేయము, ఫరజురాగము, ఏకతాళము]

కనికరమున మనవిని విను మినకుల ♦ మును వెలయించెడివాఁడా!
నెఱఱేఁడా ! మా యెకిమీఁడా !

కనివిని యెప్పు డెఱుఁగని మొకములు పొల ♦ మున నిల యీనినయట్టుల్
నలుదట్టుల్ గోరపుఁబుట్టల్

జనులఁ బసులఁ బొరిగొని పయిరులఁ దెగ ♦ దినుచు మెలఁగుచునుండన్
దగునండన్ దేవరదండన్

గని బ్రతుకుదు మని యనుకొని వినయము ♦ నను జనుదెంచితి మయ్యా
వినవయ్యా కావఁగదయ్యా!

హరి — సత్యకీర్తీ! ఇదేమి వైపరీత్యము !

పౌరుఁడు — బాబూ ! నాగతి యేమైనదో చూడు,

చ॥ తొడరి పొలాన నే నరక ♦ దున్నుచుఁ బిల్లలకోడియైన నా
పడఁతుక నొంటిగాఁ గసవుఁ ♦ బట్టులకుక్ బసినేదఁ బంపి నా
యొడయఁడ! యేమిసెప్పుదు న ♦ యో! పులివాతకు నప్పగించితిన్;
గొడుకుల నేలలోని పసి ♦ గ్రుడ్డులగోర మిఁ కేమి తెల్పుదున్?

హరి — అయ్యో ! యెంతకష్ట మెంతకష్టము !

ద్వితీ — బాబయ్యా ! నాసంగతిఁ గూడ వినుము.

చ॥ పొలములు పైరుపచ్చ పసి ♦ వోయిన నే దురపిల్లఁగాని, నా
యులజడి యేమిసెప్పుదు దొ ♦ రా! యిలునిండిన యింతలంత గం
పెఁడు పసికూనలందఱిని ♦ బెబ్బులికే బలియిచ్చి యొంటి నై
నిలిచితిఁ గొమ్మల న్నలక ♦ నిల్పిన మోడువలెన్ దపింపఁగన్.

హరి — పౌరులారా! చింతింపకుఁడు. మీచింతల నివారింతును. సత్యకీర్తీ! ఇప్పుడు వేఁట
కేఁగుటకన్న కర్తవ్య మేమున్నది ?

సత్య—పరిచారకుఁడో ద్యోగమున కిప్పు డింతకంటెఁ గర్తవ్య మే మున్నది? చూడుఁడు.

గీ॥ తనకు సేవని యున్నను ♦ జనవిభుండు
జనుల సేమంబులే కనుం♦గొనఁగవలయు
దినదినంబును దప్పక ♦ యినుఁడు లోక
ములను గాపాడకుండునే ♦ వెలుఁగునిచ్చి.

హరి—సత్యకీర్తీ! ఇఁక వేఁట జతనం బొనరింపుము.

(నేపథ్యమున వైతాళికులు)

క॥ కువలయతాప మొనర్చెడు
రవి యను పెనుమెకము నొంప ♦ రా జేతేరఁ
గవిసిన భయమునఁ బరువె
త్తు విధంబునఁ సూర్యుఁ డపర♦తోయధిఁ గ్రుంకెన్.

సీ॥ పలపలఁ దఱిపి యెం♦డ లజాండమున కెల్ల
లీలగా నెట్టని♦డాలుగూర్చి
పరరాజునకు నిజ♦పాజ్యరాజ్యము వీడి
వరుణదిగ్యాత్రకై ♦ యరిగె నినుఁడు
పతిఁ బాసి పద్మినీ♦సతి కాలగతిఁజేసి
ద్విజరాజుచేత బా♦ధింపఁబడియె
వలరాజు విప్రయో♦గులఁ గాల్ప దాకొల్పు
చిచ్చు నా సంజకెం♦జిగి రహించె
జక్కవ నిజాంగనకునయి ♦ సంతపించె
సుతచిరవియోగదుఃఖసం♦పతితుఁ డైన
వాహినీపతి యానంద♦వశతఁ బొంగెఁ
జందురుఁ డుదయించెఁ గాంతి ని♦స్తంద్రుఁ డగుచు.

హరి—సత్యకీర్తీ! మన మిఁకఁ బోవుదము పద!

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీరస్తు

# సత్య హరిశ్చంద్రీయము

## తృతీయాంకము

(పిమ్మట విశ్వామిత్ర నక్షత్రకులు ప్రవేశించుచున్నారు)

విశ్వా — శిష్యా! నక్షత్రకా! లెక్కలేని రొక్కం బడిగి యొప్పించుకొని హరిశ్చంద్రుని జేజిక్కించుకొనుటయే కాక యతఁ డిక్కడకు వచ్చునట్లు పన్నుగడఁ బన్నినాఁడ. ఇప్పు డతని మనంబు నాకర్షింప శృంగారరూపరేఖాభుజంగు లగు మాతంగకన్యల సృజించెద. ఇందు నీవుకూడ నప్రమత్తుఁడవయి సాయపడవలయును.

నక్ష — గురూత్తమా! యేదో యొక వ్యాసంగమువలన నా చదువుమాత్రము గ్రీష్మకాలవాపీజలంబువలెనే దినదినం బడుగంటుచున్నది. చూడుఁడు.

శా॥ సాంగోపాంగముగా వసిష్ఠుకడ నభ్యస్తంబు గావించె మొ
న్నం గార్గేయుఁడు చేరి వేదముల, మాండవ్యుండొ యేఁడాదియే
నిం గాలేద యగస్త్యశిష్యుఁ డయి తా, నేర్చెన్ దపోనిష్ఠ న
ష్టాంగస్వీకృతి, నాకు రా దిపుడు సంధ్యావందనం బేనియున్.

విశ్వా — వసిష్ఠుని గురుత్వము నాయెదుట వర్ణింపకు. గట్టిగాఁ బట్టుపట్టిన గడియలో విద్యలన్నియు నీకుఁ గరతలామలకంబు గావించెద.

నక్ష — పట్టుపట్టుట యెప్పటికో?

విశ్వా — తొందరపడకు. అతఁడే హరిశ్చంద్రుఁడు వేఁటకు వచ్చుచున్నాఁడు. మనము పోదము పద. (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.



(పిమ్మట రథారూఢుండై హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాడు)

ఓ కూరవ్యాఘ్రమా ! నిలు నిలుము!

చ॥ నిలువక నిర్మనుష్యధర, ణీధరఘోరదరీచయంబులన్
మెలఁగుచుఁ బక్కణంపుఁ బొలి, మేరలలో రుచిజూచుచుంటివే?
పలువ! మనుష్యమాంసములఁ, బొరకు, మిప్పుడు మచ్ఛరాహతిన్
గలుగు సుఖోపజీవనము, గ్రామజనాళికి నేఁటినుండియున్.

సూతుఁడా! బెబ్బులి వేగముగఁ బరుగెత్తుచున్నది. వాజులపగ్గంబుల సడలవిడువుము.

సూతు__ఇదిగో విడిచితిని.

హరి__ఆహా ! రథవేగమునఁ బ్రకృతియంతయు నెట్లున్నదో చూడు.

చం॥ ఎడనెడ నున్న వృక్షచయ, మేకముగాఁగ బెనంగి వెన్కకున్
బడునటుఁ దోఁచుఁ, గంటికిఁ గ, నంబడునట్టిది యిట్టిదంచు నే
ర్పడ దొకపట్టునన్, దిరుగు, వారుచుఁ గుమ్మరిసారెరీతి నీ
పుడమి యెఱుంగఁజేసెడినిఁ, బో ! తన వర్తులమైన యాకృతిన్.

సూతు__దేవా ! చూచుచుండఁగనే మెరపుదీఁగెలాగునఁ బులి యదృశ్యమైనది. ఏమి మాయ !

హరి__అలాగైన రథము డిగి పాదచారులమై దాని యడుగుజాడలఁ గనిపెట్టుదము. (దిగుచున్నాఁడు)

సూతు__(నడుచుచు) దేవా! ఇది యేదియో జనపదమువలె నున్నది.

హరి__(పరికించి)సూతుఁడా! ఇది ప్రశాంతమైనమున్యాశ్రమోపాంతభూమియే. చూడు.

మ॥ అదిగోఁ గాల్నడరేవు లున్న సెలయే, ఱా ప్రాంతలన్ బెల్లుగా
ళ్ళు, తదగ్రింబులు కొన్ని కోయఁబడినట్లుం దోఁచె, నందుండి సాఁ
గి దవిష్టంబుగఁబోవు కాల్నడలచ, క్కిం బోద మీాచెంత న
య్యాదె నీవారపుటాహుతిన్ బొడము తీ, య్యంబైన నెత్తావియున్.

ఇంకను ముందునకుఁ బోయి విచారింతము. (నడచి) సూతుఁడా!

మ॥ వనవాసవ్రతకర్మఠో త్తమ భువ, స్స్వాహేతి నాదం బడే
కనుఁగొ, మ్మచ్చట గాలిచేత నెగయుం, గాఁ గొమ్మలం దాలువే

సిన చెంగావిమడుంగుదోవతుల వాంసి జేసి చెట్టుల్ చిగి
ర్చినరీతిఁ బొలిచెఁ వసంతసమయంబ్రశీవిభ్రమాంద్రభ్రతన్.

ఇది యొక పుణ్యాశ్రమ మిందు వేఁటకుఁ గడంగరాదు. ఎఱుకులను దూరముగాఁ బోయి వేఁటాడుఁ డనుము. సత్యకీర్తీ! యెచ్చటి? చంద్రమతీ లోహితాస్యు లెంత దూరమున నున్నారు?

సూతు—ఆయుష్మంతుఁడా! వారిదె వచ్చుచున్నారు.

(రథారూఢులై చంద్రమతీ లోహితాస్యులు ప్రవేశించుచున్నారు)

(సత్యకీర్తి వెనుక నొకరథముపై నెక్కి వచ్చును)

హరి—(ఎదురేగి) తండ్రీ! లోహితా! రమ్ము. నాయనా! నీ వీ యరణ్యమృగములఁ జూచి జడియలేదు కద!

లోహి—నాన్నగారూ! నా కేమి భయము? నేను పెద్దపులినిఁగూడ క్షణములోఁ జంపివేయఁగలను.

హరి—(ముద్దు పెట్టుకొనుచున్నాఁడు)

సత్య—నాయనా! నీ వంతటివాఁడవే యగుదువు!

హరి—దేవీ! మన మిప్పు డున్న తలం బొక మున్యాశ్రమము సుమా!

చంద్ర—ఇచ్చటి మునులు మనకు సందర్శనీయులు. ఈయాశ్రమ మెవ్వరిదో?

(తెరలోపల) ఓరీ! జనార్దనా! నీవు కుశాహరణార్థమై పోయి యెంతసేపైనదిరా? వేదియం దుండిన గురువులగు విశ్వామిత్రులచే నీకు నేఁడు మూఁడినదిలే.

చంద్ర—(ఉలికిపడును)

హరి—దేవీ! విశ్వామిత్ర నామ శ్రవణ మాత్రమున నీ వి ట్లులికిపడితి వేమి?

చంద్ర—నాథా! ప్రశాంతమైన యీ యాశ్రమమునం దున్నను నామనం బేలాగో యున్నది.

హరి—నాకు న ట్లే యున్నది. చిత్తం బేటికో కలవరపడుచున్నది.

సత్య—ఘోరమైన వేఁటకర్జంబు నిర్వహించుటచే సహజకరుణాయత్తం బగు మీ చిత్తంబున క ట్లున్నది. అంతకన్న మ రేమియు లేదు.

చంద్ర—అట్లే కావచ్చును.

హరి—సర్వాంగముల కుచితశ్రమఁ గల్పించుటంజేసి కాఁబోలు నాకు నేఁడు పగలు గూడ నిద్ర వచ్చుచున్నది.

చంద్రి—అలాగైన నీ కొఱ్ఱిమ్మామిడుగున్న నీడఁ జిగురుటాకుసెజ్జ సేర్పఱచెద. నా యంకతలంబుఁ దలగడగా నమర్చుకొని యించుక సేపు సుఖనిద్రం బొందఁదగును.

హరి—ప్రేయసీ! పగటివేళ నిద్దుర కేర్పడినది కాదు. చూడు,

మ॥ అరులన్ గెల్చుటొ, కప్పములవ్వడయుటో, • యర్థిప్రజన్ బ్రోచుటో,
సురలన్ దన్పుటొ, విద్యలన్ బడయుటో, • సుశ్లోక మార్జించుటో,
పరిపాల్యంబగు రాష్ట్రముఖ్ సుఖముగాఁ • బాలించుటో, లేక రా
జు రిరంసన్ నిదురింపఁజెల్లునె పగల్ • శుద్ధాంతకాంతాళితోన్ ?

మఱియు నిద్దుర యన్న స్మరణకు వచ్చెను. నిన్నటిరేయి నపరయామంబున నే నొక దుస్స్వప్నము కంటిని.

చంద్రి—అయ్యో! అ దెట్టిదో!

హరి—నేను నిజమంత్రిపురోహిత విద్వజ్జనంబులతోఁ బేరోలగం బుండ, నతిమాత్ర తేజోవిరాజి యగు నొక మునిరాజు కనుఁగొన లగ్నికణంబు లుమియుచుండ సమీపించి యకారణంబుగ నున్నతంబైన సింహాసనము నుండి నన్ను నేలందోసి, మన రాజ్యసర్వస్వము గ్రహించి మనలఁ గట్టుబట్టలతో నట్టడవులకుఁ బాఱఁదోలె. అందుఁ బడరాని పాట్లు బడుచుంటిమి. ఇంతలో మెలఁకువ గలిగె.

చంద్రి—అయ్యో! ఎంతటి దుస్స్వప్నము! ఇదంతయు మన కశుభమునే సూచించుచున్నదే. నాకును నట్టికలయే వచ్చినది.

సత్య—దేవా! దేవీ! మీకే యశుభములును రావు. నిన్నటిదినమున విశ్వామిత్రున కిచ్చిన ధన మతఁడు వెంటఁ దీసికొని పోకుండ మనకడనే యుంచి నాదులకుఁ జిత్తమున నేమో విచారించుచు నిదురించితిరి. దానిచే నిట్టి కలలు వచ్చియుండవచ్చును చూడుఁడు.

క॥ నిదురించుటకును మును దా
మది దేనిఁ దలంచు నదియె • మానవునకు స్వ
ప్నదశన్ గనఁబడీ నటులై
పదిల్పపదిగఁ గలవరింపుఁ • బలుకులు వెడలున్.

ఆయినను నిట్టివి దేవబ్రాహ్మణ సంతర్పణముల శాంతింజేయఁదగును. చింతింపకుఁడు. ఇప్పట్టున వినోదముగాఁ గాలము గడుపుటకు మన యాశ్రితులైన సంగీతపాఠకులైన దగ్గఱ లేరే!

(పిమ్మట నిరువురు మాతంగకన్యలు ప్రవేశింతురు)

మాతం__అర్థిజనకల్పభూజా ! రాజలోక ఓడౌజా ! జోహారు.

హరి__సత్యకీర్తీ ! వీర లే కులము వారలో ?

మాతం__మేము మాతంగకులాంగనలము. రాజా ! కులముతో నేమి ?

గీ॥ తగనిదే కాని తనుదాని, పొగడి కొనుట
విమలసంగీతసాహిత్యవిద్యలందుఁ
బలకుల వెలది మాతోడి, పాటుసుమ్మ!
సవితృకులదీప ! శ్రీహరిశ్చంద్ర భూప !

హరి__(చంద్రమతితో) దేవీ ! కొంత తడ వీ యంగనల సంగీతము విందమా ?

చంద్ర__కాలక్షేపమున కిప్పు డిదియే మంచిమార్గము.

సత్య__మాతంగాంగనలారా ! మహారాజు గారు మెచ్చునట్లు మీసంగీతకళాకౌశలంబు ప్రదర్శింపుడు.

మాతం__భాగ్యము. (అని వీణలు శ్రుతిఁజేసి పాడుచున్నారు)

గీతిక; ఖరహరప్రియరాగము - ఆదితాళము.

సరసుఁడ ! నే నినుఁ, జాల పలచితిరా
కరుణను నీబిగి, కౌఁగిలి వేఁడితిరా ॥సర॥
ని న్నెద నమ్మి నే, నిద్దుర మానితిరా
మన్ననతో నొక, మాటయు ౦నవా ॥సర॥

హరి__సత్యకీర్తీ ! వీరు పాడుచున్న గీతికలోని యర్థము నా కంత రుచింపలేదు. కాని వీరి కంఠస్వరముమాత్రము వీణానాదముతోఁ గలసి శ్రోత్రపేయముగా నున్నది. చూడుము.

మ॥ చెవు లెక్కించుచు గోళ్ళమీటుచు విపంచీతంత్రులన్, దారువుల్
చివురింపన్ గలకంఠకంఠరుచిర శ్రీగీతముం బాడి రీ
యువతుల్ వీనులకున్ స్వకంఠరుతమో, హో ! నేర్పుచున్నా రనన్
జెవులన్ బిందుచుఁ జెంపలన్ జఱచుచున్, శిక్షావిధానంబులన్.

వీరి కీ ముక్తాహారము బహుమానకృతిగా నిచ్చి పంపివేయుము. (ఇచ్చుచున్నాఁడు)

సత్య__గోసంగిపడుచులారా ! మహారాజుగా రనుగ్రహించిన యీబహుమానకృతిం బరిగ్రహింపుఁడు. (ఈఁబోవ)

మాతం—రాజేంద్రా! మా కీ ముక్తాహార మేటికి?

గీ॥ ప్రౌఢి మా విద్య మీవంటి ♦ ప్రభులు చూచి
మెచ్చినటులైనఁ బదికోట్లు ♦ వచ్చినట్లె
రసికుఁడవు గాన మాకు నీ ♦ ప్రాపు మొదట
కావలయుఁ గాని పిదప రొ ♦ క్కమున కేమి?

హరి—ఏమనుచున్నారు? వీరిమాటలు నాకర్థము కాలేదు!

మాతం—రాజేంద్రా! అర్థము కాకుండుట యెట్టిగ?

గీ॥ రాజులకు మిన్నవఁట, రతి ♦ రాజువోని
చక్కఁదనమఁట, మిక్కిలి ♦ జాణవుఁట,
జవ్వనులమఁట, పాటలోఁ ♦ జతురల మఁట!
తెలిసికొను మీవె మెవ రేల ♦ తెలుపవలయు?

హరి—సత్యకీర్తీ! వీరివర్తనము తెలియ వచ్చినది. ఇంక వీరి నావలకుఁ బంపివేయుము

మాతం—రాజేంద్రా! నీ వని కోరి యింతదూర మేతెంచిన యర్థినుల వ్యర్థముఁగా బంపి వేయుట నీవంటి దాతకుఁ దగిన పనియా? ఒకమాఱు నీ యాశ్లేషసౌఖ్య మొసంగినఁ జాలదే?

సత్య—ఛీ! నికృష్టవనితలారా! ఆవలకుం బొండు.

ఉ॥ టక్కులమారిపోకలు ఘుం ♦ టారము లెక్కడఁ జెల్లు నక్కఁడే
ముక్కవ దీర్చికొండు కొఱ ♦ మాలిన మీ బయకారి వర్తనా
లిక్కడ సాఁగిరావు చనుఁ ♦ డీ మఱి యీ వెడమాట లాడినన్
గ్రక్కున ఖండఖండములు ♦ గా నఱికింతును మీదు నాలుకల్.

చంద్ర—నాథా! వీ రెంత దుశ్చరిత లైనను నర్థినులై వచ్చిన కామినులగుటచేఁ గొంత సౌమ్యముగా నే యవ్వలకుం బంపివేయుట మంచిది.

సత్య—అమ్మా! ఇంకను నీచచండాలాంగనలఁ బాపమనవచ్చునా! భద్రా! వీరి నిచ్చట నుండి వెడలఁగొట్టుము.

భద్రు—ఓ గోసంగి కులటలారా! ఇంకను గదలరేమి? మీవీపులు బ్రద్దలు కావలయునా యేమి?

మాతం—(ఏడ్చుచు) ఓ హరిశ్చంద్రా! మమ్మి ట్లన్యాయముగాఁ గొట్టించెదవు గా; కానీ! మాతండ్రిగారగు విశ్వామిత్రునితోఁ జెప్పి నీ యుసురుఁ దీయింపకున్న మమ్మా పేరులం బిలువ వలదు. (అని పెద్దపెట్టున నేడ్చుచుఁ బోవుచున్నారు.)

చంద్రి.—(విస్మయముతో) నాథా! వీరు విశ్వామిత్రమహర్షి కూతులా? అయినచో మా లెత లెట్లుయిరో!

హరి.—ఏమో! యిదంతయు నింద్రజాలమువలె నున్నది. ఇంతకు నేదియో దుర్యోగము కొఱకై మన మీ యాత్ర మోపాంతమునకుఁ జేరితిమి.

గీ॥ అశుభములు వచ్చునప్పు డ◆యత్నముగనె
బుద్ధులును వాని కనుకూల◆ముగనె తోఁచు
దొంగ యిలు సేరునప్పుడే ◆ దొరను వలచి
నిదుర పెద్దమ్మ శయ్యను ◆ వదలనట్లు.

సత్య.—రాజేంద్రా! అ దేమో వినవిండు.

(తెర లోపల)

శా॥ ఔనా! మిమ్ముఁ బ్రచండదండముల న◆న్యాయంబుగా మోద నా
భూనాథాధముఁ డంపెనే భటచయం◆బుల్ మీపయిన్ బాపియై
కానీ! యింకఁ ద్వదుష్ణబాష్పఘృతయో◆గప్రోజ్జ్వలన్ మామకీ
నా నూనోగ్రసమగ్ర కోపశిఖి లే◆దా మిమ్ము నూరార్పఁగన్.

హరి.—(విని)సత్యకీర్తీ! ప్రళయకాల ధారాధరగర్జానుకారియైన యా సింహనాదంబు విశ్వామిత్రునిది కాక మ ఱెవ్వరిది?

చంద్రి.—(భయముతో) నాథా! ఇప్పుడేది తెఱువు?

గీ॥ కనుగొనల నుండి జ్వలదగ్ని◆కణము లురల
వేఁడినిట్టూర్పుఁ బొగ లుడు ◆ వీధి కెగయ
దండము ధరించి రెండవ◆దండధారి
గతి నిటే వచ్చుచున్నాఁడు ◆ కౌశికుండు.

హరి.—దేవీ! జడియకు. కుఱ్ఱవాని దగ్గరఁ దీసికొమ్ము. నిరపరాధులమైన మనల విశ్వామిత్రుఁడుమాత్ర మేమి చేయఁగలఁడు?

విశ్వా.—(కోపముతో) ఓరీ! హరిశ్చంద్రా! నీ విప్పు డెక్కడకుఁ బోయెదవురా?

స్రగ్ధర

కొండంచున్ నిన్నుఁ బ్రేమన్◆గొలువదలఁచి నా◆కూఁతులీనాఁడురాఁగాఁ
గొండంచున్ జేతులారన్ ◆ కుమతి!రయిమునఁగితే ◆ ఘోరమాదండనంబున్
గండంపై చండరోషో◆గ్రశిఖశిఖల నీ ◆ కండక్రొవ్వేగ్ప గాథే
యుండే దండెత్తినండై ◆ యునికి కడుగుమా ◆ యోపునేమో వసిష్ఠున్.

హరి—(భార్యాపుత్రులతోఁ బాదములపైఁ బడి) మహాత్మా! రక్ష మాం రక్ష మాం.

విశ్వా—(దురాగ్రహముతో) ఛీ! పాపీ! (కిరీటముందన్ని) అడుగుంబెట్టి మాయాశ్రమమే కాక మాపాదముఁగూడ నంటుపగచుచున్నావురా దుష్టా!

హరి—ఆహా! నేఁడుకదా నాశిరమునకు నుత్తమాంగ మను నామము చెల్లినది.

మధురగతి రగడ; కమానురాగము - ఆదితాళము.

ధన్యుడనైతిని • తాపసచంద్రా!
మాన్యంబయ్యెను • మామక జన్మము
పావనమగు నీ • పాదస్పర్శము
చే విమలత్వము • జెందెను నాశిర
మేగతి నొచ్చెనొ • యీ మృదుపాదము
వ్రేగగు నాదు కి•రీటము తాఁకున.

విశ్వా—ఓరీ! దుర్మదాంధా! వైవస్వతకులకలంకా! ఏమిరా నీమాయావినయములు?

క॥ పరికింప నెదుట వినయ
స్ఫురణము మో మింతచాటు • నొందిన నిందా
పరిభాషణ మరెరే! నీ
శరణార్థియుఁ జంకదుష్టు•చందము దెలిసెన్.

ఓరీ! దుర్వినయశీలా! ఇప్పుడు మాపాదముమాత్రమే కాదురా, నీదుశ్చరిత్రము వలన మాసర్వాంగములు నొచ్చుచునే యున్నవి. ఓరీ! మాయావీ! మాయంగీకారము లేక మాయాశ్రమము ప్రవేశించుటకు నీ కెవ్వ రధికార మిచ్చిరో తొలుతఁ జెప్పుము, నీ రాజాధికారము తపస్వులపైన మాయెడం బనికివచ్చునురా! పనికివచ్చినను,

మ॥ బలగర్వంబునఁ గన్నుగాన కిట నీ•వారెల్లరుం జేరి మా
లలితోద్యానలతావితానముల నె•ల్లం ద్రెంచి గగ్గోలుగా
ఫలవృక్షంబులసాం పడంచి కుసుమ•వ్రాతంబులన్ రాల్చి కా
వలువై మా హరిణార్భకంబుల వధిం•పంబోవ నెట్లోర్చితో?

ఇట్లాశ్రమమెల్ల నపవిత్రమొనర్చుటే కాక యర్థినులై వచ్చిన నాముద్దుకూఁతులవ్యర్థముగాఁ బాడించి తుదకు నాలుకలు గోయుఁడు నని బయలుదేరితివఁట! నీతాతముల్లెవారి కేమి గట్టిపెట్టితివి? ఓరీ! దుర్మతీ! మున్నెవ్వరు రాజులు లేరా? వేఁటకురారా? నీమృగయావిహారమునకు మావంటి జడదారుల యాశ్రమములే కాని పనికిరావేమి? భూచక్రమునందలి రాజులెల్లఁ బాదాక్రాంతులై యుండ నీవు చక్రవర్తిపదమున విఱ్ఱవీగుటెంతయు మావంటిమునులయాశ్రమములఁ బాడుచేయుటకే యని నా కిది వఱకుఁ దెలిసినది కాదురా మునిద్రోహీ! చూడు మిప్పుడు నిన్నేమిచేసెదనో! నీవే మొనరించినను మంచిదనుచు నీకిచ్చకంబులాడుచుఁ బొట్టకూటికై నీకు వెట్టిచాకిరి చేయు వసిష్ఠుఁడ ననుకొంటి వేమి? నీవొనరించిన యీయపకృతికిఁ బ్రతివిధానముఁ జేయుకుంగుటకు మే మంత యసమర్థులమా!

హరి—ఎఱుఁగక చేసిన నా యపరాధముల క్షమింపుఁడు.

విశ్వా—ఓరీ! వాచాలా! ఏమన్నావు? అపరబ్రహ్మయైన విశ్వామిత్రునే యెఱుఁగవా? ఎట్లు!

సీ॥ ఎఱుఁగవా త్వత్పురో।హిత వసిష్ఠతనూజ
శతక నాళీక కుం।జరుని నన్ను?
తలఁపవా ప్రతిబంధి।త స్వర్నివాస త్రి
శంకర్థ నిర్మిత।స్వర్గునన్ను?
మఱతువా గురుతపో।మహిమ ప్రకల్పిత
ప్రతిసృష్టి నిందిత।బ్రహ్మ నన్ను?
తెలియవా యనితరా।ధీన తపోమహా
త్త్వావాప్త ఘోర ది।వ్యాస్త్రి నన్ను?
ప్రాజ్యరాజ్యస్మయాంధకా।రంబు నీదు
కనుల కెగదట్టె నంతనే। గానరానొ?
యొడ లెఱుంగవొ? మతి వోయె।నో దురాత్మ!
ఏల యెఱుఁగవు? చెప్పు మోరీ! దురీశ!

హరి—దేవా! అపరబ్రహ్మను మి మ్మెఱుంగనివాఁ డెవ్వఁడు?

గీ॥ జగములం దెందు మీసృష్టి। సాగుచుండఁ
బ్రాఁతపంచార మయి పోయె। బ్రహ్మసృష్టి
తేజమున నగ్ని మీతోడ। దీటురాక
మర్త్యశముపేరఁ దాల్చెను। ధూమరేఖ.

విశ్వా—అలాగైన నెందకన్నెలుంగని సుకుమారశరీరలతామతల్లులు గానకళావిలాసినులగు నాకూఁతులకు లెన్నఁడురాని తరాజవు నీవు వచ్చితివి. ఇంక నోడిలో వరాలకుప్ప నొలకింతువని ప్రాణములన్నియు నీపైననే నెలకొల్పుకొని పరువెత్తుకొని వచ్చినందులకు వారికిఁ దగిన సత్కారము లొనరింపక, పొగరుచే మమ్ముఁగూడ గణింపక నాలుకలు గోయఁబోయినది మ మ్మెఱిఁగియే! అలాగయిన నీవిషయమున మే ముపేక్షాభావమున నుండరాదు. దురాత్మా! కుసుమకోమలులైన రాజబింబాస్యలపై మోమోట మించుకయైన లేక నాలుకలు గోయుగు నన్ను నీనాలుక యిప్పుడు వేయిచీలికలు గావలదా? మునిద్రోహీ! నీముఖము జూచిన కొలంది నేయివోసిన యగ్గివలె నామనంబు భగ్గుభగ్గున మండుచున్నదిరా!

హరి—మునీంద్రా! నేనొనరించినవన్నియుఁ దప్పులె యైనను క్షమాగుణసంపన్నులైన మీవంటి తపస్వులకు దీర్ఘకోపంబు సనదు కాన

తోదకవృత్తము; కాఫీరాగము-చతురశ్రగతి.

మనవిని వినుమా ♦ మనుఁ గనుఁగొనుమా
తనయునిపై నింతటి పగ చనునా?
కనికరమున సాకక యిటు తగునా?
కనలునఁ బెను సంకట మిడ నగునా?

మఱియు

గీ॥ పొగరుగలవాని నడఁచుట ♦ పోలుఁగాక
దీనత నడంగువాని సాధింపఁదగునె?
పడఁగ నెత్తినపాముఁ జం ♦ పఁదగుఁగాని
చచ్చిపోయినదానినే ♦ చంప నేల?

కావున నన్నుఁ జేపట్టినదాక మీపాదపద్మముల విడువను. (అని నమస్కరించును)

విశ్వా—(స్వగతము) ఆహా! ఈతని క్షమాగుణసంపత్తి యెంత యొప్పుచున్నది! [ప్రకాశముగా] విరాగులమై సంసారములఁ బాసి తపస్సుఁజేసికొనుచున్న మాకు దీర్ఘకోపంబు సనదు. నీతప్పులన్నియు నీయందే యుండనిమ్ము. శరణాగతరక్షణ మవశ్యకర్తవ్యము గనుక నీభయం బుడిపి నిన్నుఁజేపట్టినారము. నాయుపదేశం బొందు గలదు; నీ పద్దానిమేరకుఁ దప్పక ప్రవర్తింతువేని నాకోపాగ్ని నిశ్శేషంబుగాఁ జల్లారును.

హరి—దేవర ధర్మోపదేశంబులఁ బరిగ్రహించుటకు సిద్ధముగానే యున్నాను. పాప కార్యంబునకు నన్ను మీరు పురిగొల్పుదురా?

విశ్వా—ఎట్టి పాపకృత్యంబు లైనను మాయాజ్ఞయైన వెనుక నయ్యవి పుణ్యకృత్యంబులుగా మాఱవలసినదే.

హరి—మీ రపరబ్రహ్మలు గదా.

విశ్వా—భళీ! నీకు మామహిమ లిప్పుడు బాగుగఁ దెలిసి వచ్చినవి గాన.

శా॥ అన్యాలోచనలేల? యిచ్చితి వివాహం బాడుమా నేఁడు నా
కన్యారత్నములన్ సురూపవతులన్ గాంధర్వవిద్యాజగ
న్మాన్యప్రాభవలన్, వయోంచితకళామత్తల్లులన్, భూరిసౌ
జన్యశ్రీల; వహింపుమింకను బ్రశస్త్రీసుఖాభోగమున్.

హరి—(చెవులు మూసికొని) దైవమా! నాపాపము శాంతించునుగాక.

చంద్ర—(స్వగతము) అక్కటా! ఎంతటి యధర్మమునకుఁ బాల్పడుమనుచున్నాఁడు.

సత్య—మునీంద్రా! ఇది యెందైన సరియైన యుపదేశమా?

శా॥ అంటంగూడని మాలకన్నియలతో నామేలు మేల్పెండ్లి పే
రంటాలీ రవివంశరాజుల యశః ప్రాకట్య మిప్పాటిదా?
అంటంగూడని వేల్పుసాక్షిగ వివాహంబైన యిల్లాలి నొం
తంటంగోసి తదన్యకన్యల వివాహంబాడు టే ధర్మమా;

విశ్వా—ఓరీ! మూర్ఖా! సత్యకీర్తి! నీవిప్పుడు లేనిసంబంధము గల్పించుకొని మాతో నిర్భయముగాఁ బ్రతివాదము చేయుచున్నందులకుఁ బిడుగువంటి మాశాప మిప్పుడే నీమీఁదఁ బడుం జుమీ.

చంద్ర—(స్వగతము) అక్కటా! కోప మంత కంతకు మితిమీఱుచున్నదే.

లోహి—ఓబ్రాహ్మణుడా! నీవెవ్వఁడవు? మమ్మందఱ నదలించుచున్నావు.

చంద్ర—నాయనా! నీవైన నీతాపసుని కోపాగ్ని కింధనంబవుకాక బ్రతికియుండుము. (దగ్గఱఁదీసికొనును)

విశ్వా—ఓరీ చెడుగా! నీ విప్పటినుండియు నీ శౌర్యము మావంటి జడదారులపై నుపయోగించుచున్నాఁడవురా శుంఠా!

హరి—ఆర్యా! కన్నులఁ దెఱవని ఓనితో నేమి?

విశ్వా—ఓరీ! కపటశీలా! నీవును నీమంత్రియుం జాలక నీకొడుకును గూడఁ గాట్ల కుక్కవలె మాపైకి నుసిగొల్పు చున్నావు గా?

హరి—దేవా! బాల్యచాపల్యము చేఁ గలిగిన వాని యపరాధమును క్షమింపుఁడు.

విశ్వా—క్షమించినారము. ఇఁక మాయాన నిర్వర్తింపుము.

హరి—మునీంద్రా! సకల ధర్మస్వరూపు లగు మీరు నా కిట్టి దురుపదేశ మొనర్పఁ బాడియా? చూడుఁడు.

మ॥ అరయన్ వంశము నిల్పనేకద! వివాహం; బట్టి వైవాహిక
స్ఫురణం బిప్పటి కెన్నఁడో జరిగె; సంతుష్టిందు పుట్టెన్; వయః
పరిపాకంబును దప్పుచున్నయది యీ ప్రాయంబునన్ వర్ణసం
కరపుం బెండిలి యేల చుట్టెదవు? నాకంఠంబునన్ గౌశికా!

మునీంద్రా! ఇహపరంబులకు శెంటికిఁ జెడు మార్గంబును న న్నేల ద్రొక్కు-మందువు? దురంతమైన యట్టి పాపకర్మం బాచరించి ముందుఁ బరసౌఖ్యంబునకుఁ జెడుమందురా?

విశ్వా—ఓరీ మూర్ఖా! నీ మేలు నీవు చూచుకొనలేకున్నాఁడవు. ఎప్పుడో వచ్చు పరసౌఖ్యముల నమ్మి యిప్పుడు కంటికిఁ గనఁబడుచున్న సామ్రాజ్యాద్యుత్తమభోగంబులు విడుచు వెఱ్ఱివాఁ డెందైనఁ గలఁడా? వీరినిఁ బెండిలియాడకున్న మాత్రమున నీకొఱకై స్వర్గద్వారములు తెఱచి పెట్టఁబడి యుండు ననుకొంటి వేమి? మీవంటి తుచ్ఛరాజులకు స్వర్గసౌఖ్యములు కూడనా? 'రాజ్యాంతే నరకం ధ్రువ' మను వాక్యము వినవో? కాన వ్యర్థప్రతివాదములు చాలించి మాయాజ్ఞాప్రకార మీపంచమ కన్యలం బరిగ్రహించి పూజ్యంబైన సామ్రాజ్యభోగంబులతోఁ బాటుగ నీయంగనల వలని భోగంబుల యథేచ్ఛగా ననుభవింపుము.

హరి—అకటకటా! ఇది యెక్కడనైన సరియైన బోధయా? మానుషజన్మ మెత్తినందులకుఁ బాపుల శిక్షింపఁ బైన దండధరుం డొకఁ డున్నాడనియైన దుష్కార్యముల పొంతఁ బోకుండవలయుఁగదా!

విశ్వా—ఓరీ! వెఱ్ఱీ! నీ కింకను బాపపుణ్యవివక్షత యెందుకు? ఏమీ దండధరుండా?

శా॥ పాపంబేయగుఁ బుణ్యమేయగును వి, శ్వామిత్రసిద్ధాంతమా
వ్యాపారంబును బూర్వపక్షమొనరింపన్ దండహస్తుం డెవం?
డా పాపిష్ఠునిఁజోలి యెందులకు? నవ్యస్వర్గరాజ్యప్రతి
ష్ఠాపాండిత్యముచేత నీ జనకుఁ డాండన్ నిన్ను రక్షింపనే.

కావున నే నీ వా యమునిభయంబు దక్కుము. ఇదిగో,

మ॥ అరణం బిచ్చెద నేమి కావలయునో ♦ యర్థింపు సంతానపుం
దరులో, జక్కులరేనిపెన్నిధులో, చిం♦తారత్నమో, హేమభూ
ధరమో, కౌస్తుభమో, సుధారసమొ, యిం♦ద్రత్వంబొ, బ్రహ్మత్వమో
ఉరగాధీశఫణోల్లసన్మణిగణం♦బో, కాక యింకేవియో.

హరి — దేవా! మీతపోబలం బెంతకైనఁ జాలినదే కాని,

శా॥ "సిగ్గేలాగున లేకపోయెఁ దనకి♦స్సీ గాధిరాట్సూతి యే
లగ్గో కూర్చెద నన్న నాసపడి యి♦ల్లాలుండ నిర్భీతి నే
యెగ్గూహింపక మాలకన్నియల దో♦యింబొంది యర్కాన్వయం
బగ్గింద్రోసె" నటంచు ఛీ! యనరె న♦న్నా బాలగోపాలమున్.

విశ్వా — ఓ ఆత్మశ్లాఘీ! దురభిమానీ! నాకూఁతులం బెండ్లియాడిన నీకు లోకనిందగా? నీమొగమున కట్టిభాగ్యమే కలిగిన నీభోగభాగ్యంబులు మూఁడుపూవు లారుకాయలుగా నుండి నిన్నుఁ బట్టఁ బగ్గంబు లుండక,

గీ॥ "ఇతఁడె యీతఁడె నూతన♦సృష్టికర్త
యైన గాధేయునల్లుఁ" డ♦టంచు నిన్ను
నందలంబుల నిల్పి జో♦హారు లిడరె
నర సురాసుర యక్ష గం♦ధర్వులేని ?

హరి — తాపసోత్తమా! మీకు నే నే మని ప్రత్యుత్తరం బిత్తును?

శా॥ ఆకుంబోకను బొంద దీ పలుకు, న♦వ్యంబైన బ్రహ్మత్వమే
మీ కైలాటపుమాలకాన్పు; లివియే ♦ మీ లోకదూష్యంబు మీ
వాకుంబొందుటఁ జూచి యేమొగమునన్? ♦ వాయెత్తెదన్ మీకులం
బేకాదా! మఱి నాది?; చెల్లుబడి యా♦నే యిట్టి సంబంధముల్ ?

విశ్వా — ఓరీకృతఘ్నా! నీ మేలుకోరి నీకు హిత ముపదేశించుచున్నందులకు 'క్రొత్తగా వచ్చినబ్రహ్మత్వ' మని మ మ్మధిక్షేపించుచున్నావుగా! ఆలాగైన నీగురుపుత్రుఁడగు శక్తి శాపమువలనఁ జండాలత్వము గాంచిన త్రిశంకునందనుండ వగు నీది మాత్రము కాదేమి? కరుణామతిచే మీయందు రాజత్వముఁ బునఃప్రతిష్ఠ యొన

ర్చుట మాదియే తప్పు. ఇంతకు మాయిచ్చు నీ యపూర్వవిభవంబులతో మాకన్యలం బరిగ్రహింతువా లేదా? చెప్పుము.

హరి—మునీంద్రా!

పంచచామరము - జంఝూటిరాగము - ఆదితాళము.

వృథాకదా సుధారసంబు • రీతి నున్న నాకుల
ప్రధానధర్మముం దొలంగ • భాగ్యభోగసంపదల్
అధోగతుల్ దొలంగ రాజ్య • మైనఁ గాని వీడెదన్
బుధోత్తమా! వరింప మాల • పూవుఁబోండ్ల నమ్మఁడీ.

విశ్వా—హరిశ్చంద్రచక్రవర్తీ! ఆమాటయందు నిలిచియుండుము. తప్పిపోయిన నా సదాశివుపాదంబులకుందప్పినవాఁడ వగుదువు. చిరకాలంబునుండి మరల రాజ్యంబేల వలెయు ననుతలంపు నామది బాధించుచున్నది. నేటికి నీయౌదార్యముచే నా కది లభించినది. పట్టణంబున కిప్పుడేపోయి సింహాసనం బధిష్ఠించెద: అచ్చటరాజపురుషు లభ్యంతరము చెప్పకుండుటకు నీముద్రిక నిమ్ము. ఆడినమాట తప్పకుండుము.

హరి—దేవా! ఆడి బొంకుదునని తలంచితివా?

మ. విడువంగాఁబడె నెన్నఁడో చెలికిపి • ప్పింబోలె మీచేత ముక్
విడువంగాఁబడి సారమెల్ల నెది దా • నిక్ మీరలాసించి న
న్నడుగం గాదని చిన్నబుచ్చఁగలన • య్యా! మిమ్ము నిస్సారపుం
గొడవల్ రాచరికంపు సౌఖ్యములు మీ • కుం గ్రొత్తలా విందులే.

విశ్వా—ఇఁక నీచమత్కారములు మాకడఁ జెల్లవు. వారివీరివలె మమ్ము నీమాయాజాలంబులఁ బడవేయనెంచితివి. ఈలాటికుయుక్తులు మాకు నీకంటె లక్షు దెలియును. రాజులందఱిలో నీవేమో సత్యసంధుఁడవని వింటిని. నేఁటి కాపేరు నేతిబీర కాయయైనది. మాట పెదవిదాఁటుటకు ముందే యోజించుకొనవలసి యుంటివి. పిదపఁ బశ్చాత్తాపముఁ బొందినఁ బ్రయోజనంబేమి? ఇఁక వేయిమాటలతో నేమి "నేనిప్పుడు ప్రసంగాంతరఃమునఁ బొరబాటున నట్లంటి, రాజ్యము నీకీయఁదలఁచి కాదు"అని స్పష్టముగాఁ జెప్పివేయుము. పిదప నే ప్రత్యుత్తరంబిచ్చిన ఛీ యనుము.

చంద్ర—నాథా! యేల స్సందేహించెదరు?

మ॥ తరుణీ న్నేనొకపాటినే తమకుఁ గ • ర్తవ్యంబు బోధింపనే ని
ద్ధర కాణాచియె మీకు నొక్కరికి మాం • ధాత్రాదిరాజన్యులెం

దలు పాలించిరి యొందరేగి రిక్త నెందఱో వసుధాస్థలిన్
కలయేనిఁ వెనువెంటఁ గట్టికొని యేఁగఁ జాలరే యింతకున్.

శా॥ మేనన్ బ్రాణము లున్నయంతవఱకున్ మిథ్యానుబంధంబునన్
దా నల్లాడుఁ బ్రపంచమెల్లఁ దనదే నాన్, జచ్చుచోఁ గడ్డిపోఁ
చేనిన్ వెంబడిరాదు, ప్రాణికి యశం బే తక్క వే రెం డనూ
చానుం డిమ్మని కిండు దానముగ రాజ్యంబున్ యశంబుం గనన్.

విశ్వా—(స్వగతము) ఆహా! ఈ పతివ్రతాలలామ సత్యవ్రతాభిమాన మెంతయొప్పుచున్నది.

హరి—ప్రాణేశ్వరీ! నీవు నాపాలిటి కల్పలతవు. లోకంబున ననుకూలదాంపత్య మిట్లు గదా యుండవలయు!

గీ. పతుల యత్నంబు లోనఁగూడు, నతులుగూడ
పిలుపు మాటల వారిని, వేపకున్నఁ
బాములను మొక్క మొలచిన దాదిఁ బురుగె
తొలఁచుచుండిన నది యెంత దూర మెఱుఁగ?

(దోసిలియొగ్గి) ఓ భగవతీ! భూదేవీ!

సీ॥ సతత దానక్రియారతుఁడ నంచు జగానఁ
బేరందినాఁడ నీ కారణమున
క్రతువు లొనర్చి దేవతలు మెచ్చ యశంబు
గణియించినాఁడ నీ కారణమున
మితిలేని ద్రవ్యసంగతుఁడనై భోగవి
స్తారుండ నైతి నీ కారణమున
చతురబ్ధివేష్టిత క్షితిపసంతతి యెల్ల
కనుసైగ మెలఁగె నీ కారణమున
గీ॥ ఇంత కాలంబు నన్నాశ్రయించికొంటి
విపుడు విధి తప్పివచ్చుట నేన నిన్ను

నమ్మికొనుచుంటి సత్య విత్తమ్మికొఱకు
శ్రీగుణోద్దామ! రాజ్యలక్ష్మిలలామ!

(చంద్రమతితో) దేవీ! దానధారాసంభృతంబగు బంగారుభృంగారువు గైకొనుము.

చంద్ర—(దానజలము విడచుచుండ)

హరి—బ్రహ్మర్షిసత్తమా! రాజ్యదానంబు పరిగ్రహింపుఁడు.

శా॥ దేవబ్రాహ్మణమాన్యముల్ విడిచి భక్తిన్ సప్తపాథోధి వే
లావిభ్రాజదఖండభూవలయ మెల్లన్ మీకు దానంబుగా
భావంబం దొకశంక లేకొసఁగితిన్ బ్రహ్మార్పణం బంచు దే
వా! విశ్రాంతిగ నేలుకొమ్మిఁకను నీ వాచంద్రతారార్కమున్.

రాజర్షితిలకా! రాజలాంఛనం బగు నీ కిరీటంబు ధరియించి యీ ధారుణీచక్రము నిర్వక్రముగాఁ బరిపాలింపుము.

విశ్వా—హరిశ్చంద్రా! నీ యౌదార్యము మిక్కిలి శ్లాఘనీయము. నీకు దీర్ఘాయు రారోగ్యములు కలుగుఁగాక! నీ విఁక నీభార్యాపుత్రులతో మా రాష్ట్రంబు వదలి పొమ్ము. సత్యకీర్తి మంత్రిత్వమునకై యిక్కడనే యుండవలయును.

హరి—చిత్తము. (సత్యకీర్తితో) మంత్రిసత్తమా! సత్యకీర్తీ! నీ విఁక నిమ్మహర్షి నాశ్రయించుకొని కాలంబు వెళ్ళఁబుచ్చుము.

సత్య—(దుఃఖముతో)

మాలినీవృత్తము; రాగము ముఖారి - ఆదితాళము.

అమలగుణకలాపా హా! హరిశ్చంద్రభూపా!
మిము వదలిన నే నీ మీఁగ జీవింపఁగలనా?
తమ కెపుడు నివాసస్థానమౌ నీటిఁ బాయన్
నిముసమయినఁ దమ్మిల్ నిల్చునే వాడకుండన్?

ప్రభూత్తమా! ఇన్నాళ్ళు ముద్దుగాఁ బెంచి కడకు చిలుకను గండుబిల్లికివలె నీ కౌశికునకు నన్నప్పగించెదరా? నేను మీకడ నుండఁదగనా?

హరి—సత్యకీర్తీ! నీవు ధీమంతుఁడవు. నిన్నుఁగూడ నావెంటఁ దోడ్కొని పోయితినేని విశ్వామిత్రుఁడు నాగొంతు గొఱుకక మానఁడు. అదియుంగాక నారాజత్వముతోఁబాటు నీమంత్రిత్వముగూడ మానినచో రాష్ట్రీయప్రజాఘోషంబు మిం

మీఱక మానదు. కావున నీవు నామాటఁ బాటించి పురంబున కేగుము. (ఆకర్ణించి) ఎక్కడి దా కలకలము ?

(పిమ్మట రాష్ట్రీయ ప్రజలు గుంపులు గుంపులుగాఁ బ్రవేశించుచున్నారు)

పంచచామరము; గేయము-త్రిశ్రగ

బలంబుమీఱ గాధిపుత్రుఁ • బట్టికొట్టి చంపుఁడీ
ఖలుండు వానిఁ ద్రాళ్ళ బిట్టు•గట్టి యగ్గి వ్రేల్చుఁడీ
మలీమసుండు వానికాయ•మాంస మెల్లఁ గోసి యీ
పొలాన నున్న పక్షిజాతి • భూతకోటిఁ దన్పుఁడీ.

[అని కత్తులఁ ద్రిప్పుచున్నారు]

హరి—సత్యకీర్తీ! చూచితివా ? పౌరు లెంత నిర్భయముగా సంచరించుచున్నారో ?

విశ్వా—(స్వగతము) భళిరే! వీరి రాజభక్తి యెంత నిరూఢమైయున్నది. వీ రిప్పుడు నాప్రాణములఁ దీసినను దీయవచ్చు.

పౌరులలోఁ బింగళకుఁడు—అరే, ఆ దొంగముని యెక్కడ నున్నాఁడురా!

త్రైభ్యుఁడు—ఇఁడేరా !

సోహణకుఁడు—అరె! ఊరకుందు వేమిరా, పొడువుము.

హరి—పౌరులారా ! ఏమి యీ సాహసము !

పౌరులు—[వినకయే] సుగంధివృత్తము; గేయము-త్రిశ్రగతి.

మచ్చుఁజల్లి రాజ్యమెల్ల • మాయగా గ్రహించి యీ
సచ్చరిత్రు నూరినుండి • సాఁగనంపు దేమిరా!
పచ్చిదొంగ! నీతపంబు • పాడుగాను ఏలరా!
హెచ్చుగాను బెంచుకొన్న • యీ జడ ల్దహింపనా ?

[అని కొట్టఁబోవుచున్నారు.]

విశ్వా—[స్వగతము] ఇప్పుడు వీరిపైఁ గోపించి శాపం బిచ్చుటకంటె హరిశ్చంద్రు నదలించుటయే యుచితము. [అనికోపముతో] ఓరీ! కపటశీలా ! హరిశ్చంద్రా ! మజల రాజ్యమును గ్రహించుటనుఁ గడ కీ పన్నాగము పన్నితివిరా ?

హరి—[కోపముతో] పౌరులఁజూచి పౌరులారా ! మీ కీయాగడము తగదు. ఇమ్మహాను భావుఁడే మీ కింకఁ బ్రభువు. కాన నెప్పటియట్లు రాజభక్తియుక్తులరై ప్రవర్తింపుఁడు. నాకు మాటఁ దెప్పింపకుఁడు.

పౌరు — మహాప్రభూ ! మమ్మా పెద్దపులికే యొప్పజెప్పిపోయెదరా ?

హరి — పౌరులారా ! మహర్షులఁ దిరస్కరింపఁగూడదు. మఱియు,

మ॥ చనునే యింతటిసాహసంబు? ధరణీసామ్రాజ్య మెక్కాలమొ
క్కనికే చెల్లునె ? కాలపుం బ్రకృతి నొక్కండేగనిం గొక్కఁడౌ
ను నృపుండీ నరజన్మ మిట్లు గనుచుండుం మార్పులన్ రాష్ట్రపుం
జను లేనాఁటి కెవండొ ఱేఁడతని నిచ్చం గొల్వనౌ మెచ్చుగన్.

చంద్ర — పౌరులారా ! భర్తగారిమాట జవదాటకూఁడదు.

పౌరు — అమ్మా ! మేమిఁకఁ జేయవలసిన దేమున్నది ?

ఉ॥ మమ్మును గన్నబిడ్డల క్రమమ్మున నింతకు మీరు పెంపఁ గ
ష్టమ్ములులేక మీకరముచాటునఁ జల్లగనుండఁ గష్టకా
లమ్ము ఘటిల్లె మీకె; విచలత్పవనాహతి వ్రేళ్ళుఁగోడ మూ
లమ్మె గభాలునన్ బడ నిలన్ జిగురాకు లిఁ కేమి రాజిలున్ ?

హా! రాజాధిరాజా ! ఎంతలో నెంత యన్యాయము సంభవించినది !

పింగ — సీ॥ ఇలఱేఁడ ! గంపంత బలగ మిచ్చట నీడి
యొంటిగా నడవి నెట్లుందు వయ్య

శైభ్య — శ్రీదేవి ! చంద్రమతీదేవి ! నీవంటి
బంగారుతల్లి నెవ్వం డొసంగు

కాహ — వని కేగెదవె ? చిన్నిబాబయ్య ! నీ కింక
వేళకు నన్ను మెవ్విధి లభించు

పల్ల — ఈపుట్టువులకు నీవే సత్యకీర్తయ్య !
యాదరవుగ నుండరాఁ దటయ్య

పింగ — గీ॥ కడుపుఁ గండలఁగోయు నీ జడలమాటి
అధిప! మా కేడ దాపర మయ్యెనయ్య

శైభ్య — జగము బాలించు మేల్దొరసాని వీవె
యిట్టి యగచాట్లపాలైతి వేమనందు.

హరి—పౌరులారా! దుఃఖింపకుఁడు. సత్యకీర్తీ! వీరితో నీ విఁకఁ బట్టణంబున కేగుము. మే మిక్కడ నుండియే పోయెదము.

సత్య—అక్కటా! నే నెంత దురదృష్టవంతుఁడను; రాజేంద్రా!

ఉ॥ చిన్నతనంబునుండి ననుఁ • జేరఁగఁదీసి కుమారురీతిగా
మన్ననతోడఁ బెంచి తన • మంత్రిపదంబున నుంచినట్టి నా
కన్నగురుండ వీగతినిఁ • గానలపాలయి పోవుచుండ మీ
సన్నిధినుండ నోఁచుకొనఁ•జాలనియట్టి కృతఘ్నుఁడన్ గదా!

అమ్మా! నేను తల త్రాయిజేసుకొని పోవుచున్నాను. తిరిగి యెన్నాళ్ళకో మిమ్ము జూచు భాగ్యము. నేను మీలో హితునివంటివాఁడ నైనను మీవెంట గొనిపోకుండ మీరు లేని యీ పాడు పురంబునకు బొమ్మనుచున్నారు గదా!

హరి—[కౌగిలించుకొని] సత్యకీర్తీ!

చ॥ ఇదివఱ కెన్నఁడున్ గుణని•ధీ! జవదాటవు నాదుమాట యీ
యదనునఁగూడ నాపలుకు • లారసి యీ కుశికప్రసూతికిన్
ముదమొదవన్ జరింపు సత•మున్; గలదేని ఋణానుబంధమే
యొదవుఁ బునస్సమాగమము•ఖోన్నతులే మన కీ జగానవే.

సత్య—హా! యెంతకష్ట మెంత కష్టము!

విశ్వా—సత్యకీర్తీ! నీ వింకను గదలకున్నా వేమి? నీవుపోయి పురంబెల్ల నలంకరించి మదీయ పట్టాభిషేకోత్సవముఁ జాటఁ బంపుము.

సత్య—అయ్యో! హరిశ్చంద్రుఁడు లేని యయోధ్య కిం కెక్కడి యలంకారము? రాజేంద్రా! పోయివత్తును, మీకు శుభంబగుఁ గాక!

హరి—సత్యకీర్తీ! పౌరులారా! పోయిరండు.

[పౌరులును సత్యకీర్తియు నిష్క్రమింతురు.]

విశ్వా—హరిశ్చంద్రా! నీవింక నిక్కడ నుండ నక్కఱలేదు. మాకుఁ జాల ప్రొద్దు పోయినది. పొమ్ము.

హరి—చిత్తము. [పోవుచుండ]

విశ్వా—ఉండుండుము. నాదగ్గఱకు రమ్ము. సింహాసనముపైఁ గూర్చుండి రాజ్యం బేలు మాకుఁగాని యీమణిభూషణంబులు మీకేల? కావున మీమీనగలన్నియు నిక్కడ దిగవిడిచియే పోవలెను.

హరి—అలాగే తీసికొనుఁడు [అని తమనగల నిచ్చి] దేవా! మే మిఁకఁ బోయివత్తుము.
[నిష్క్రమింతురు]

విశ్వా—[స్వగతము] ఎందునను నీ రాజేంద్రుండు నాకు లోఁబడకున్నాఁడే. ఇప్పుడు మఱియొక యెత్తు నెత్తెదను. [అని బిగ్గఱగా] ఓరీ! హరిశ్చంద్రా! హరిశ్చంద్రా!

హరి—(ప్రవేశించి) దేవా! మఱల నేమి?

విశ్వా—[కోపముతో]

మ॥ అరరే! యెంతటిమోసగాఁడవుర స, త్యం బన్న నిప్పాటిదా?
పరవి త్తంబును బాయసంబుగ భుజిం, పన్ జూతువా? నాఁడు న
క్కరుర యజ్ఞార్థము దానమిచ్చినది రొ, క్కం బెక్కడన్ దాచినా
వుర? ఛీ! కక్కనకూటి కాసవడు దు, ర్బుద్ధుల్ ప్రశంసింతు రే?

దురాత్మా! మా ఋణధనం బెగవేసిపోవ నెంచితివిరా?

హరి—మునీంద్రా! ఎక్కడి దా ఋణంబు?

విశ్వా—(కోపముతో)

శా॥ ఏమీ! యెక్కడి దా ఋణం? బసలు లే, నేలేద? మోమెత్తి యే
దీ మావంకను దేఱిచూచి యను మ, ట్లే యెట్లు నోరాడునో?
యీమాటాడునదేది వాకొనుము నా, ల్కా? తాటిదూలంబ? ఛీ
యీమర్యాదకు సత్యమూ ర్తి యని ని, న్నెట్లాడురా? లోకముల్?

హరి—మునీంద్రా! మ మ్మింత యన్యాయము గా బాధించుట పాడియయ్యా!

గీ॥ ధరణి సర్వస్వముఁ మీకె, ధారవోసి
కట్టుబట్టలతో నిట్లు, నట్టడవికి
దైన్యమున నేగుచున్న మా, తలను నింక
లేనియప్పులఁ గట్టఁ జె, ల్లింపఁగలనె?

విశ్వా—ఓరీ! పాపిష్ఠా! కృతఘ్నా! దుర్మదాంధా! యేమని వాగితివి? ఇంక నొక్క మా టట్టికూత కూయుదువా, నీనాలుక పీఁకించి గ్రద్దలకు వేసెదను. చేఁగాని యీవుల ముం దేడ్చుట యేందుకు? పిదప నీలాటి తులువకూఁతలు కూయుట యెందుకు? మా సొమ్ము మే మడుగుట లేని యప్పుల దలం గట్టుటా! ఈ రాజ్యదానంబుఁ గూడ దానిలోఁ జేరినదా? చెప్పుము!

హరి — మునీంద్రా! కోపింపకుఁడు. నే నిప్పుడు చేత నరకాసైనలేని నీచదరిద్రగతియం దున్నాఁడఁగదా! ఇంక నొక్కమాసంబు గడువొసంగిన నేపాటునైనం బడి మీ సొమ్ము చెల్లించెదను. నన్నింక వదలివేయుఁడు.

విశ్వా. — ఆలాగునఁ జేయుదుము. మొదటనే ఇట్లడుగుకొనిన నెంత బాగుండును?

హరి — క్షమింపుఁడు. నేను పోయివత్తు.

విశ్వా — పొమ్ము. (కొంచె మూరకుండి) హరిశ్చంద్రా! ఉండుండుము. ఇంక మాకొక్క సందేహము బాధించుచున్నది. నీకు దినదినము లభించు ద్రవ్య మన్నపానాదులక్రింద వ్యయపఱచుచున్న మా ఋణమెట్లు తీఱఁగలదు? ఎప్పటిదప్పుడే పుచ్చుకొనుచుండిన మాకును మీకును సౌలభ్యముగా నుండును. ఆహారముపట్ల వ్యవహారముపట్ల మోమోటము పనికిరాదు. కావున నీపైఁ దరువుగ నా శిష్యుని నక్షత్రకుని బంపెదను. శిష్యా! నక్షత్రకా!

నక్ష — (ప్రవేశించి తనలో) మాగురువుగారెంతలో రారాజును బిచ్చాలరాజుం జేసినారు. (ప్రకాశముగా) గురూత్తమా! నమస్కరించుచున్నాను.

విశ్వా — (రహస్యము నభినయించుచు) నక్షత్రకా! నీ వీ రాజువెంట నేగి యాయా ప్రదేశములం దీతఁడు గణించిన రొక్కంబునం దొక్క కాసైన వ్యయపఱుప నీయక చేఁజిక్కించుకొనుచు మోమోటము విడిచి నిర్దయవృత్తి వహించి, నిముసమైనఁ గూర్చుండనీయక యహోరాత్రంబులు గాఢప్రయాణంబులచే నలఁగించి, యన్నపానీయముల కెడ మీయకుండ, ధైర్యమువదలించి, దైన్యము గలిగించి, కోపమున నదలించి యేలాగునైనను నీతనిచే నబద్ధ మాడింపుము. తెలిసినదా? (హరిశ్చంద్రునిఁ జూపించుచు) నక్షత్రకా! ఈతఁడు మన కీయవలసిన రొక్కము నెల దినములలో నిచ్చునట! అందు నొక్కగవ్వయైన దిగఁబెట్టక కూర్చుకొనిరమ్ము. హరిశ్చంద్రా! ఈతఁడు పిన్ననాఁటనుండియుఁ గడుగారాబమునఁ బెరిగినవాఁడు. ఆయాసమున కోర్వఁడు. పట్టి యలిపిఱికి. ఆఁకలియైనప్పుడు తిన్నగా నన్నముఁ గూడ నడుగనేరఁడు. కావున వీని వేకన్నులఁ గనిపెట్టి యన్నపానాదులకు ముప్పూట వేళదప్పింపక నామాలుగాఁ జూచుకొనుచుండుము. పొమ్ము.

హరి — దేవా! సాధ్యమైనంతవఱ కట్లే చూచుకొనియెద. నా కింక సెలవొసంగుఁడు. నక్షత్రేశ్వరా! రండు. (అని పోవుచుండ)

విశ్వా — హరిశ్చంద్రా! మఱియొకమాట వినిపొమ్ము.

హరి — (ప్రవేశించి) ఏమి సెలవు?

విశ్వా—అయ్యో! వెఱ్ఱిరాజా! నీకేమి పిచ్చియా? నే నిన్ని విధముల బోధింపుచుండ నాయంతవాని యుపదేశంబుఁ ద్రోసివేసి పడరాని యగచాట్లకుఁ దలయొగ్గి పోవుచున్నావే. మా రాష్ట్రములోఁ గడకు నీకొక పిడికెఁ డటుకులైన దొరకకుండఁగట్టి కట్టడి చేసెదను. మా యప్పెట్లు తీర్తువోయీ! నీకీ నిష్కారణబాధ యెందులకు? చక్కఁదనాల చుక్కలగు నా పెంపుడు గూఁతులం బెండ్లియాడి యఖండ భూమండలాధిపత్య మంది భోగభాగ్యములఁ దులదూఁగుచుండుము. అట్లుకాదేని నీవుపడు పాట్లింకఁ గుక్కలుం బడవు.

హరి—గాధినందనా! నే నీకష్టము కష్టముగా భావించుటలేదు. ఇంక నన్నేల బాధించెదరు?

శా॥ ఆకల్పాంతము నంతయుం గనని సత్యస్థైర్యపుం గీర్తియే
నాకుం జేకుఱునేని నే యిడుములైనం గోరి జన్మాంత మెం
తో కౌతూహలవృత్తిచే ననుభవింతున్ జాచలశ్రీసుఖ
ప్రాకట్యం బదియేల; నిశ్చల యశస్సౌలభ్యమే లేనిచోన్.

విశ్వా—(నవ్వుచు) సరిసరి, ఇనుప గజ్జెల తల్లియగు పెద్దమ్మ కిట్టిం చెప్పులజోడు తొడుగుకొని నీకు ముందు ద్రోవదియుచుండఁగా నీవు నామాట యెట్లువిందువు! ముందు ముందా యరణ్యములలో నెత్తిమాడుచుఁ గాళ్ళునిండ ముండ్లువిరుగ సింహ శరభ శార్దూలాది ఘోరమృగంబుల భయంకరారావములు విని గుండె ఝల్లన (లోహితాస్యునిఁ జూపించి) నీరండ కాలుసేతులునిలువక లబ్బున మొత్తుకొనుచుండ (చంద్రమతిం జూపుచు) నీ నిర్భాగ్యురాలు నీవెంట నీయగచాట్లుపడలేక 'అయ్యో! మాలదైవమా! ఈమాయమగని నాకుఁగట్టి యింత చేటు గట్టితివా' యని గొల్లన నేడ్చి తూర్పాఱంబట్టుచు దుమ్మెత్తాల్చి నీ మొగమునఁ గొట్టినప్పుడు గాని, నామాట లిప్పుడు నీకు రుచింపవు. రోగికి పథ్యాహారంబు చవి యగునె? పొమ్ము. పొమ్ము.

హరి—మాగతి యెట్లయినను గానిండు. మే మిఁకఁ బోవుచున్నాము.

(నిష్క్రమింతురు)

విశ్వా—(స్వగతము) ఆహా! యీమనోనిశ్చయ మీసత్యవ్రతనిరూఢి యెంత శ్లాఘనీయము! రవంతయైన నా మాయలను జలింపకున్నాఁడే! కానీ! ఇంక గావలయు విధాన మాలోచించెద. (నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.



శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## చతుర్థాంకము

[ఎమ్మట దీనవదనుఁడై హరిశ్చంద్రుఁడు, వెనుకనుండి చంద్రమతి, లోహితాస్యుఁడును బ్రవేశించుచున్నారు]

హరి—(స్వగతము) అకటా! దుర్గమంబగు నీయరణ్యంబు దాఁటిపోవు టెన్నటికో! దైవమా! ఆగర్భ శ్రీమంతురాలైన దేవి కింతటి దురవస్థఁ దెచ్చి పెట్టితివి!

గీ॥ ఘనజఘనభారమున లేఁత • కౌను గునియఁ
దీవ్రచండాతపమున మైఁ • తీవ వాడఁ
గనుఁగవ దొరంగు కన్నీటి • కాల్వతోడ
నడువలేక నడువలేక • నడచుచుండె.

చంద్ర—(ప్రవేశించి) నాథా! నా కాయాస మంతకంతకు మిక్కుటమగుచున్నది. నే నేమిసేయుదు?

హరి—దేవీ! కుఱ్ఱవానిఁ గొంతసేపు న న్నెత్తుకొననిమ్ము. (తీసికొని) నాయనా! నీ కింతటి కష్టము వచ్చెనురా!

లోహి—నాన్నా! మన మింక నెంతదూరము పోవలెను?

హరి—నాన్నా! ఇంక నడచినఁగాని తెలియదు.

చంద్ర—ప్రాణేశ్వరా! ఇంకను నడువవలయునా?

మాలినీవృత్తము; కీరవాణిరాగము - ఆదితాళము.

కడుబడలితి నాథా! • కాలు సాఁగింపఁ జాలన్
బడిబడి నడువంగన్ • శ్వాసముల్ దీర్ఘమయ్యెన్
గడుసుఁదనఁపుముండుల్ • గాఁడెఁ బాదంబులందున్
నొడుకు మొదలె పోలెన్? ఘోరమౌ నెండచేతన్.

హరి—హాదేవీ! రాణివాసంపుభోగము లనుభవింపవలసిన నిన్నీ ఘోరారణ్యంబుల కీడ్చి తెచ్చి కుసుమసుకుమారమైన నీశరీరము నీలాటి దీర్ఘయాత్రలచే నలఁగఁజేసిన నన్ను నే నేమని నిందించుకొందును? ప్రేయసీ!

సీ॥ ఏనాఁడు నడచినా • వీ యొడారులలోన
సలలితారామ•సీమలనె కాని,
ఏనాఁడు తలసూపి • తీ ప్రచండపుటెండ
కలఘుమాణిక్యకాం•తులకె కాని,
ఏనాఁడు చవిచూచి • తీ కందమూలముల్
సరసరాజాన్నభో•జనమె కాని,
యేనాఁడు చెవిఁజేర్చి • తీ క్రూరమృగరుతుల్
లీలాశుకాలాప•పాళిఁ గాని,
కటకటా! యెన్న డెఱిఁగి తు•త్కట దినేశ
ఖర కిరణ జాల తప్త క•ర్కశ శిలాద్రి
కటక గమన శ్రమోద్భూత • చటుల చింత
నను వరించుటఁ జేసి యీ•నాఁడె కాని.

చంద్ర—హృదయేశ్వరా! నాకై చింతింపకుడు. మీరుమాత్ర మనుభవించుచుండిన సౌఖ్యం బేమి? ధరపై బుట్టిందిన యెట్టి ప్రాణికైనను గొన్నినాళ్లు సుఖంబును, గొన్నినాళ్లు దుఃఖం బనుభవింపక తప్పదుకదా! చూడుఁడు. పాప మా నక్షత్రేశ్వరుఁ డీ యెండ కెక్కడ సోలెనో? మన మెట్లయినను ముందా వటూత్తముని నేమ మరయుటయే యుచితంబు.

హరి—సతీమణీ! ఇట్టి కష్టములయందును బరోపకారమున నేమఱకుండిన నీ సౌశీల్య మనన్యసామాన్యంబు. అతఁడే నక్షత్రకుఁడు వచ్చుచున్నాఁడు. ఇంతలో ని న్నా కురువకవృక్షచ్ఛాయ విశ్రమింపఁజేసి నక్షత్రకుని నక్కడకుఁ దోడితెచ్చెదను. దేవీ! కొంచెము దూరము నడువుము.

చంద్ర—అయ్యో! బ్రొత్తుగా నడుగుడిసి యడుగుపెట్టుటకు వీలులేకుండఁ బాదముల యందుఁ గంటకములు విఱిగినవే, ఎట్లు నడువఁగలను?

హరి—అక్కటా, ఎట్లు నడువఁగలవు?

మ॥ నవనీలోత్పలతాళవృంతములఁ గాం♦తల్ చెంతలన్ వీవ లేఁ
జివురుంగే లొకబాల యూఁచి యుడి నిన్ ♦ సేవించుచున్ దోడరా
బువుఁదోఁటన్ నడువ న్నలంగు తలిరుం♦బూఁబోణి వెట్లోర్చు వు
గ్రవనీ దుర్గమ మార్గ కర్కశ శిలా ♦ గాఢ ప్రయాణ వ్యథన్.

చంద్ర—నాథా! యెల్లకాలం బొక్కరీతి నెవ్వరికి సాఁగివచ్చును? మెల్లగా నడిచెదను.
(నడుచుచున్నది)

హరి—దేవీ! ఆరామభూవిహారసమయంబున దాసికాజనము నీకుం బట్టు గొడుగుల నీడ నడుచు సౌఖ్యంపుమాట యంతరించెనుగదా! ఇప్పుడు నీ పయ్యెదకొంగె నీకు సకలచ్ఛత్రములు. దేవీ! ఇదే కురువకవృక్షము. దీనినీడఁ గొంత విశ్రమింపుము. నాయనా! మీయమ్మకడ కేగుము.

లోహి—నాన్న గారూ! మనవెంట వచ్చిన బ్రాహ్మణుఁ డేఁడి?

హరి—వచ్చుచున్నాఁడు బాబూ!

[పిమ్మట నక్షత్రకుఁడు కపటశ్రమ నభినయించుచుఁ బ్రవేశించును]

నక్ష—రాజా! నీప్రయాణము పాడుగాను. మా గురువుగారు నన్ను నీతో నేల పంపినాఁడురా బాబూ! సొమ్ము పుచ్చుకొనవలసిన యతఁ డాశ్రమమందును జెల్లింపవలసినవాఁడవు నీ విచ్చట భార్యాపుత్రులతోడను సుఖముగా నుండ మీయిరువుర మధ్యను నాసుకండియలాగునఁ గాళ్ళుపడిపోవునట్లు తిరుగుటకు నాకర్మ మేమి గాలినదయ్యా? రామ! రామ! (కూలబడును)

హరి—నక్షత్రకా! ఏమి, యేమి?

నక్ష—ఇంకా యేమి యేమి! యేబెబ్బులియో నన్ను గుటుక్కున మ్రింగివేయనీ యని యీ ఘోరారణ్యములో నన్ను వెనుకం బడవైచి నీవును నీ యాలుబిడ్డలును సుఖముగా వచ్చినారుకదా! చాలు, నే నెక్కడఁ జచ్చిన నీ కేమి?

హరి—అయ్యో! నే నట్టి ద్రోహిని కాను.

నక్ష— తన్వీవృత్తము; రాగము హిందూస్థానికాఫీ - ఆదితాళము

చాలునుపో! నీవలనఁ జెడితి నా ♦ చావునకున్ నిను విధి విధియింపన్
బోలు శిలాకంటకములఁ బఱపి ♦ ఘోరవనంబుల నను నడిపింపన్
గాళులముండ్లు ల్విఱిగి దోనదోనన్ ♦ గాఱెడు రక్తము మిడిమిడి యెండన్
బోలితి నోరెండును కడుదగచే♦స్రుక్కె నెలుంగిక బ్రతుకుగతించెన్.
అయ్యో! మాటగూడఁ బడిపోవుచున్నది.

హరి___నక్షత్రికా! అల్లదె కురువక వృక్షమునీడకు నిన్ను మెల్లఁగఁ దీసికొనిపోయెద రమ్ము. కొంతయాయాసము తీఱును.

నక్ష___ఆఁకలితోఁ జచ్చిపోవువాని కాచెట్టునీడ యెందులకు? చచ్చిపోవువాఁడ నిక్కడనే చచ్చెదను. (పడిపోవును)

హరి___నక్షత్రికా! మెల్లఁగ రమ్ము.

నక్ష___అయ్యా! మొత్తముమీఁద నీవు నన్ను బ్రతుకనీయవు. ముందు నా కింతనీరు ధారకము పోయవయ్యా. నాకుఁ జెట్టు వద్దు, చేమ వద్దు.

హరి___అయ్యా! ఇక్కడ నెక్కడను నీరు లేదే.

నక్ష___మఱి న న్నీలాటి యరణ్యమున కేల తెచ్చితివి?

హరి___అయ్యా! స్నేహముకుదురకమున్నొక్కని గుణాగుణములవలెనే తోలుత నా కిది నిర్జలస్థల మని తెలిసినదికాదు.

నక్ష___అవును. ఏపెద్దపులినోటనైనఁ బడి యీబప్పనారి చచ్చినచో మనయొప్పను గువాఁడు లేకుండుఁగదా యని యెంచి నన్నిచటికీడ్చి తెచ్చిన మాయోపాయము నీకు బాగుగఁ దెలియునుగాని మ తేదియుం దెలియదు.

హరి___అయ్యా! నిష్ఠురము మాటలాడకుఁడు.

నక్ష___నిజమాడిన నిష్ఠురమే.

హరి___నటూత్తమా! లేచిరండు. ఇందెందైన నీరుదొరకునేమో వెదకెద.

నక్ష___అలాగయిన నాచేయి పట్టుకొమ్ము. నాకు బొత్తుగ సత్తువ యుడిగిపోయినది. వాడిపోయిన పెరుగుతోటకూర కాడవలె నున్నాను.

హరి___(నక్షత్రికు నడిపించి) ఇక్కడఁ గూరుచుండుము.

లోహి___అమ్మా! నా కీనాఁడిన్ని మంచినీళ్ళయిన లేవుగా! తల్లీ! నాకేమోయాయాసముగా నున్నదే.

చంద్రి___బిడ్డా! మనకు నేఁడు పెట్టనిదినము వచ్చినది.

హరి___అకటకటా! సార్వభౌమకుమారునకు నేఁడన్నోదికములుగూడఁగఱవయ్యెఁగా. అయ్యో! నే నిప్పు డేంతని చింతింపను.

శా॥ శ్రేయోబంధుర సార్వభౌమపదవి, క్షేమంబు ప్రాప్తించెఁబో
యీ యాధ్వానపగణ్యమధ్యమున స్వామీ! యున్నమో రామచం
ద్రా! యంచుక్ విలపించుచుక్ బ్రియసుతుం, డల్లాడఁగాఁజూచియుఁ
సాయం బేమియుఁ జేయలేనిగతియే ◆ న న్నేఁచు ఓ పాపమో?

దేవీ! ఎక్కడ సంపద లెక్కడి సౌఖ్యములు;

మ॥ తిరమై సంపదలెల్ల వెంట నొకరీతిన్ సాఁగిరా వేరి కే
సరికేపాటు విధించెనో విధి యవశ్యప్రాప్య మద్దాని నె
వ్వరు దప్పించెద రున్నవాఁడ నని గర్వంబేరికిన్ గాదు; కిం
కరుఁడే రాజగు రాజె కింకరుఁ డగున్ గాలానుకూలంబుగన్.

నక్ష — రాజా! నీ వీ వేదాంతములు చెప్పుచుండుము. నా ప్రాణములు నీ ప్రయత్న మక్కరలేకుండ నే లేచిపోవును.

చంద్ర — నాథా! యిప్పుడు దుఃఖమున కవకాశములేదు. కుఱ్ఱవాని గతి యెట్లున్నను దొలుత నీబ్రహ్మచారి ప్రాణంబులఁ గాపాడుట కర్తవ్యము.

హరి — దేవీ! నే నెందైన నీరు దొరకునేమో పోయివత్తు. అందనుక నీబ్రహ్మచారిసేమం బారయుచుండుము. (నిష్క్రమించును)

నక్ష — ఏమీ, చంద్రమతీ! నీపతి యింకను రాలేదుగా?

చంద్ర — అయ్యో! బయలుదేరిన యెడమేది?

నక్ష — లేదు లేదు, చప్పుటకుఁగూడ నెడములేదు. తల్లీ! నా కాయాసము పుట్టినది మాట బొత్తుగా హీనస్వరముపడిపోవుచున్నది. నే నింక నాల్కపీకికొని చావవలసిన దే. నన్నుఁజూచి యింత యేడ్చుటకయినను మంచపుఁదొడుగయిన మాయమ్మ రైన దగ్గఱలేకపోయెను. అమ్మా! నీ వీపుత్ర దుఃఖ మెట్లనుభవింతువు? రామ! రామ! ఇదెక్కడి వడగాలి. ఓ చంద్రమతీ! ఇది నాకోసమే వచ్చుచున్నట్లున్నది. చూడుము,

మ॥ వడగాడ్పుల్ సుడివాఱుచున్ జురచురన్ బ్రహ్మాండముంగాల్పఁగా
దొడఁగెన్ జేటలతోడ నిప్పుకణముల్ ధూగ్నాళిగాఁ బట్టుచున్
దడిలేదింతయు నాల్కపైఁ గడుపులోనన్ జిచ్చు ముట్టించిన
ట్లడరెన్ మంటలు, బొంది నుండ వీఁక నా ప్రాణంబు లీవేదనన్.

(నేలపైఁబడును)

చంద్ర — నక్షత్రేశ్వరా! యోర్చికొమ్ము. జరాపీడితరైన నీతల్లి పుత్రదుఃఖ మనుభవింప కుండునుగాక!

నక్ష — ఏమో తల్లీ! నాప్రాణాని కెంతకావలయును? నాకాళ్ళు కదుములుగట్టి పచ్చిపుం డులవలెనున్నవి సరికదా! చావ సిద్ధముగా నున్నవాని కీడ్చున ట్లీడ్చుచున్న వేమి? ఇది నామరణచిహ్నమేమో? అయ్యో! నే నిప్పుడుబ్రతికియున్నానో లేదో (ఏడ్చును)

చంద్ర — నక్షత్రేశ్వరా! స్వయముగా మాటాడుచున్నావుకదా,

లోహి.—అమ్మా! నా కాఁకలి యెక్కువగుచున్నదే తల్లీ!

తోదక వృత్తము; హిందూస్థాని భైరవి - ఏకతాళము.

ఇన్నిదినంబుల • కేనియు నా కీ
వన్నముఁ బెట్టవు • హా! యిది యేమే
కన్నుల నున్నవి•గా యసుఁబుల్ నే
నెన్నఁ డెఱుఁగనె • యీగతిఁ దల్లీ!

చంద్ర.—అయ్యో! తండ్రీ! నీ కెంతయవస్థ వచ్చెనురా! నానావిధ భక్ష్యభోజ్యములం బట్టికొని పరిచారికాగణం బనేకవిధంబుల లాలించియు బ్రతిమాలియు భుజింపుమని నోటి కందీయ రుచిచూచి చూడని నీవు నేఁడు స్వయముగా 'అమ్మా అన్నమే' యని యతిదీనత్వమున నన్నడిగినను నీకుఁ బిడికెడన్నంబిడుటకు నాకు గతిచాలక పోయెనే! హా! దైవమా! మామూలమున నీ నక్షత్రకునికిఁగూడ నెంతటి దురవస్థ వచ్చినది? కరుణామయు లెవ్వరును విపన్నులైన యీపిన్నపాపల రక్షింపరుగా? హా! పరమేశ్వరా!

శా॥ కట్టా! యెక్కడ లేరె దీనజనర•క్షాదక్షు లీ దుఃఖపు
న్నట్టేటం బడి యేడ్చు నీ నిసువులన్ • గాపాడ; బుట్టించువాఁ
డెట్టో పెట్టక మానునా యనెడు ప•ల్కే నిక్కువంబైనచోఁ
బట్టెండన్నము కాటకంబయి నశిం•పన్ బోలునే మే మిటుల్?

(అప్పుడు నాలుగు కల్పవృక్షఫలములు పడును)

లోహి.—(ఆతురతతో) అమ్మా! ఇవిగోఁ దీయని పండులు.

చంద్రి.—బిడ్డా! మనకు నేఁడు దైవము ప్రసాదించిన భోజన మిది. నీవొకటిఁ దీసికొని నక్షత్రకుని కొక్కటిమ్మా.

లోహి.—అయ్యా! దీనినిఁ బుచ్చుకొనుఁడు (యిచ్చుచున్నాఁడు).

నక్ష.—(స్వగతము) ఆహా! ఈయామ పతివ్రతాత్వమహిమ యెంతయొప్పుచున్నది? (ప్రకాశముగా) నాకు మఱి నీ రెక్కడ?

చంద్ర.—అదిగో సరోవరము. అందుఁ దాహశాంతిఁ జేసికొనుము.

నక్ష.—నీరు(త్రాగివచ్చి) తల్లీ! చంద్రమతీ! యెంత పుణ్యాత్మురాలవమ్మా! వచ్చిపోయినవానిఁ దిరిగి బ్రతికించితివి. నీవు ఫలాహారము జేసినావు కావేమి?

చంద్ర.—నాపతి పుచ్చుకొనకయే నే నెట్లు ముందుగా ఫలాహారము చేయుదును?

నక్ష.—ఓసి వెఱ్ఱిబాగులదానా! ఎక్కడిపతిం గట్టికొంటివి?

మ॥ ఒకసన్న్యాసికి సర్వరాజ్యమును నేఁడో మాటపుట్టింపు మే
రకుఁ జేజాఁచిచి, బిడ్డతో నిను మహారణ్యంబు పాల్జేసి కూ
టికినిన్ గుడ్డకుఁగాని చెన్నిటిని వీడింబుచ్చు కేమంచు న
మ్మిక సేవింతువొ? వెఱ్ఱితల్లి! కొఱగామిన్ గాన లే వింతయున్.

చంద్రమతీ! నీవు బొత్తుగ నమాయకురాలవు. నీవు నాకుఁ బ్రాణదానము చేసినందులకు నీకు నే నెక్కువయైన ప్రత్యుపకారము చేయలేను గాని —

మ॥ పడతీ! నీ విషయంబు మా గురునితోఁ వాదించి మీ రాజ్య మి
ప్పుడ యిప్పించెద రమ్మ; నీ మగనితోఁ బొత్తుండి నల్గొంగులన్
ముడివేయం బనియేమి? నీవ ప్రజలం బోషింపుమీ, నీకుమా
రుఁడు నీ చేతికినైన వెన్క నతఁ డారోహించు మీ గద్దెపై.

అట్లొప్పించు రాజ్యము నీ పతికే యిప్పింపు మందువేమో? పట్టిమాయదారివాఁడైన నీమగని విషయమై నేఁజెప్పను. చెప్పినను ప్రయోజనములేదు. రా రాజు బిడ్డవు నీవీ కడగండ్లు పడుటకు నీ కర్మమేమి కాలినదమ్మా? లెమ్మ, నావెంట రమ్మ.

చంద్ర — నక్షత్రకా! బ్రహ్మచారిచాపల్యమున నీ విట్లాడితివి గాక, ధర్మ మించుకయైన యోజింపవైతివి. రాజ్యభోగంబు లనుభవించునప్పుడు పతి పూజ్యుండును, కాలవశంబున నేదేని కష్టము సంప్రాప్తమైనచోఁ ద్యాజ్యుండునా? పత్యనుసరణమే కదా సతీత్వమునకు మూలము. చూడు,

మ॥ జరుగన్నేరదు దేహయాత్రయును బిచ్చం బెత్తినన్ గాని, దు
ష్కరి చర్మంబులె కాని పైకిఁ దగు వస్త్రంబేనియున్ లేవు, కాఁ
పురమా కష్టపు వల్లకాట, నిఁక రూపుం జెప్పరా దట్టి మా
దిరిభర్తన్ దన మేనఁ గట్టికొని భక్తిన్ గౌరి పూజింపదే.

కావున నీ వింక నీ వెడఁగు నుడువుల మానుము.

నక్ష — నీవంటిదానికి హిత ముపదేశించుట నాదియే నేరము. (స్వగతము) మా గురువుగారు నాకు విధించిన కార్యము నాశక్తికి వంచనలేకుండ నెఱవేర్పఁ బ్రయత్నించుచున్నాను. కాని ప్రయోజన మున్నట్లు తోఁచుటలేదు. అదృశ్యుఁడై వెంట నంటి మా గురువుగా రిది యంతయుఁ జూచుచునే యున్నారుకదా!

విశ్వా—[ఎవరికిఁ గనఁబడకుండ] నక్షత్రకా! నీయం దొక లోపములేదు. మార్గమధ్యమున వీరి కేయాహారము దొరకకుండ నే మాయబన్ని యుండగాఁ గల్పవృక్షఫలము లెక్కడనుండి వచ్చెనో? అల్లనాఁడు సురసభలోఁ దన్ను దూలనాఁడి నందులకు నాకుఁ బ్రతికక్షియై దేవేంద్రుఁడే యీపనిఁ జేసియుండవచ్చును. కానీ! (కోపముతో నాకసమునఁ జూపు నిగిడించి) రే! దురాత్మా! ఇంద్రా! నామీఁద నే పంతమునకుఁ గాలుఁ ద్రువ్వుచున్నావుగా!

మ॥ అపరాధం బొనరించి గౌతమున కట్లా పాదమ స్తంబు నీ
వపు వెల్లన్ జెడ గొట్టుకొంటి విఁక విశ్వామిత్రుఁడన్ భీతిలే
క ప్రవర్తించెద వెట్టిబెట్టిదపు యోగం బున్నదో, నీకు, శా
పపు నీ రందితినేని సాగ దిట దేవత్వంబు గీవత్వమున్.

(ఆలోచించి) అయినను నింద్రుఁడే యీపని చేసెనని యెట్లు చెప్పవచ్చును? ప్రతివ్రతాతిల కంబగు చంద్రమతీదేవికై ప్రకృతియే సహాయము చేయుచున్నదేమో, కానీ! నీటికై పోయిన హరిశ్చంద్రునితోఁ జెప్పి భేతాళవృక్షముకడకు వీరిని జేర్చుమని దంతవక్త్రుని కాజ్ఞాపించితిఁగదా! అతఁడే హరిశ్చంద్రుఁడు వచ్చుచున్నాఁడు ఏమి చేయునో చూచెద.

హరి—(నిట్టూర్పుతో) అకటకటా! మానవునకీ దారిద్ర్యదుఃఖము మిక్కిలి దుస్సహము కదా! ఇంతకన్న మరణమే సర్వథా శ్రేయము. ఏలయన-

ఉ॥ చావును లేమియున్ మనుజసంతతికిన్ వ్యసనంబు లందులోఁ
జావున సంభవించెడు విచార మణంగు దినక్రమంబులన్
జీవునకీ దరిద్రగతిచే జనియించెడు ఘోరదుఃఖ మో
దైవమ! జీవము ల్గలుగు దాక నశింపక వృద్ధిఁ జెందెడున్.

అయ్యో! నేఁ డింత జలపానమునకైన నోచుకొనక పోయితిమే. ఇంక నక్షత్రకుఁడు బ్రతుకు టెట్లు? లోహితుఁ డెట్లు జీవించు?

చంద్ర—(ఎదురుబోయి) నాథా! ఆఁకలి దప్పులవలన మూర్ఛ దొలఁగి నక్షత్ర లోహితాస్యులు సురక్షితముగా నున్నారు. మీరును నీఫలముల భుజింపుఁడు. నేఁటికి మీకీ ఫలాహారమైన లభించినది. (ఇచ్చును)

హరి—దేవీ! యీఫలము లెట్లు వచ్చినవి?

నక్ష—ఎట్లు వచ్చినవా? మాయమ్మ పూర్వపుణ్యమువలన వచ్చినవి?

హరి—నక్షత్రికా! అట్లేకావచ్చును. (చంద్రమతితో) దేవీ! నాకు నాఁకలి దప్పు లడంగినవి. కాని మనము నేఁటిరేయి నిదురింప నొక వటవృక్ష మిక్కడనే యున్నది దాని నొక మునీశ్వరుని వలన నెఱింగితి.

నక్ష—(స్వగతము) వాఁడే దంతవక్త్రుఁడు కాబోలు! ఇఁక నెట్లయిన వీరి నక్కడకు జేర్పవలయు. (ప్రకాశముగా) అలాగైన హరిశ్చంద్రా! నీఁకటిపడకమునుపే యచ్చటికిఁ జేరుట మంచిది. నా కప్పుడే నిద్ర తూగివచ్చుచున్నది.

హరి—పోదము రండు. (కట్టువాని నెత్తుకొని నడచుచున్నాఁడు)

చంద్ర—(నడచుచు) వటవృక్ష మింకెంత దవ్వున నున్నది?

హరి—దేవీ! అదిగో చూడుము.

మ॥ వాడినపండుటాకు లిల, పైఁ బవనాహతి రాలుచుండె నో
చేడియ! గబ్బిలంబులు వి, చిత్రముగాఁ దలక్రిందు లౌచు వ్రే
లాడెడుఁ గొమ్మలన్, శిశువు, లక్కడ దమ పొట్టలక్రిందనూఁదుకొం
చూడలపై విలాసముగ, నుయ్యెల లూఁగెడిఁ గ్రోతిపాళెముల్.

నక్షత్రకా! ఈవటరాజంబు తన నీడచే భూతకోటినిఁ జక్కఁగాఁ బోషించు చున్నది కదా!

నక్ష—ఏమోయీ రాజా! నన్ను భూతాశ్రమస్థలంబునకుఁ దీసికొని వచ్చితివా యేమి?

హరి—కాదు కాదు. మనకు నివాసయోగ్యమైన చోటికే. దేవీ! శయనయోగ్యము లుగా నిచట నెలవులు బాగుచేసికొనుట మంచిది. చీఁకటి యప్పుడే కనుమూసి కొని వచ్చుచున్నది.

చంద్ర—(బాగుచేసి) నాయనా! లోహితా! యిచ్చటఁ బండుకొమ్ము.

(అందఱు శయనింతురు)

హరి—(లేచి) అక్కటా! కాలాంజన మలందినట్లు బ్రహ్మాండమంతయు నంధకార బంధురమై యెంత భయంకరముగా నున్నది. మార్గాయాసముచే గాఢనిద్రావస్థ యందున్న వీరి కే యిక్కట్లు రాకుండ రక్షింపవలయుఁగదా! (చంద్రమతింజూచి) అయ్యో! సార్వభౌముని యిల్లాలికా యిన్ని కడగండ్లు. నే నెంత ధైర్యమవలం బింత మన్నను శుష్కపవాసకృశత్వయై నూదిరాలపైఁ బయ్యెదకొంగు పఱచుకొని పండుకొనియున్న యీదేవిం జూచినపుడెల్ల నాహృదయము మఱింత దుఃఖసంకులం బగుచున్నదే! హా! ప్రాణసతీ! నీకు నేఁడిన్ని కందమూలము లేనియు లేకపోయెఁ గదా! హా! దేవీ! హా! అసూర్యంపశ్యా! ఆపాడు వేఁటకు బయలుదేఱిన నాఁటి తోడనే నీకును నీసౌఖ్యంబులకును ఋణము దీఱెనే!

సీ॥ ఆరామవనసీమ, యా రామ! నీకు నీ
ఘోరవల్మీకకాం, తారసీమ?
తతహంసతూలికా, తల్పంబులో నీకుఁ
గలికి! యీ మొఱపరా, కటికనేల?
చెలికత్తియల మేలు, కొలుపుపాటలె నీకుఁ
నారి! యీ క్రూరమృ, గారవములు?
అలరుఁ దేనియతో ఫ, లాహారమా నీకుఁ
జవిలేని యీ వేఁడి, చవిటినీరు,
పూత సరయూనదీ సమా, యాత మంద
వాతపోతాభిగమ్య సు, వర్ణ సౌధ
తల మణి డోలికా సౌఖ్య, కలన లేక
నిదుర గాంచితె కటికరా, నేల నేఁడు.

హా! సుతా! లోహితా! నీ వెంత యదృష్టహీనుండవైతివి తండ్రీ!

మ॥ అడు గెన్నం డిడనీక నేలపయి, న, ట్లల్లారు ముద్దారఁగా
నుడిగింపుం జెలిపిండు క్రొంబసిఁడి మే, లుయ్యాలలం దుంచి పో
రుచుఁగన్ "జో ఇనవంశమౌక్తికమణీ!, జో లోహితా!" యన్న సం
దడిఁ గన్మూసెడు నీకు నెట్లమరె ని, ద్రాసౌఖ్య మీ తూలపై?

(అప్పుడు తెరలోపలఁ గలకలాంతరము)

(ఆకర్ణించి) ఏ మిది! వృక్షసంచలనమైనది. మఱేమి యుపద్రవము లేదుకదా!

(పిమ్మట సపరివారుఁడైన భేతాళుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ఓరీ! యెవఁడురా? త్రిలోకభీకరం బగు నీ భేతాళవటవృక్షోపాంతమున నిర్భయముగా సంచరించుచున్నాఁడు?

శా॥ అక్షుద్రుండ నను వేఁడ కీ వటతరు, ప్రాంతంబునన్ రాఁడు ఫా
లాక్షుండేని, నరాధమా! తెలియవే, రా నన్ను భేతాళునిన్
వక్షంబుల్ విదళించి, పీల్చుచుఁ గవో, ష్ణంబైన క్రొన్నెత్తురుల్
భక్షింతున్ రుచులూర నీపలలముల్, భక్ష్యోపభోజ్యక్రియన్.

పరిజనము__అరే, వీనికండలు భక్షింపుఁడు. పొడువుండు.

హరి__(స్వగతము) వీరికి నిద్రాభంగము కలుగకుండ నా దుర్మార్గుల నేనే సమీపించి వధించుట మేలు. (సమీపించి) రే! దురాత్మా! భేతాళా! యీ వటం బాశ్రయించియుండి నీవుచేయు దౌర్మార్గ్యం బిదియా? కాని యింక ద్రుళ్ళకుము.

భేతా__ఔరా! ఎవఁడవురా? నిర్భయముగా నాకే యెదురు పల్కుచున్నావు? (మీది కుఱుకును.)

హరి__రే! దుష్టా! లోకకంటకా!

మహాస్రగ్ధర.

పటుమద్దోశ్చంద్రహాసోత్పతనమున భవత్ప్రాణము ల్లేచు నేత
ద్వటవృక్షోపాంతభూమిన్ వ్యపగతభయులై పాంథకోటుల్ చరింపన్
గుటిలా! కాలానుభూతిన్ గువలయపతితన్ గోలుపో నైజమాయా
చటులక్షాత్రోగ్రశౌర్యచ్ఛవి యెటుల హరిశ్చంద్రుఁడీడున్ దురాత్మా!

(జుట్టుపట్టి యవ్వలి కీడ్చుకొని పోవును)

భేతా__అయ్యో! చచ్చితి, చచ్చితి. పరిజనులారా! రండు రండు.

పరిజనము__నెచ్చెలులారా! మన మిక్కడనున్న చావు దప్పదు. రండు పాఱిపోదము.

(పాఱిపోవుదురు)

నక్ష__(అదరిపడిలేచి) ఓచంద్రమతీ! ఓరీకుత్సా! లోహితా! లెండు లెండు. మనము నిష్కారణముగాఁ జావవలసిన యోగము వచ్చినది.

చంద్ర__అయ్యో! ఏమి యప్రియము సంభవించినది?

నక్ష__ఇం కేమి యప్రియ మోతల్లీ! ఈ మఱ్ఱియూడలను పెనుభూతము లనేకములు గుభిల్లుగుభిల్లుమని దుముకుచు నామీదఁ బడి యిదిగో నీవైపునకుఁ బరువెత్తినవి. అందులో నొక్క పెద్దదయ్యమును నీపతియుం బెనఁగులాడుచు నీవంక కేగిరి.

చంద్ర__(సభయయై) ఏమి! నక్షత్రకా! నాపతి యిచ్చట లేరా?

(తెరలోపల)

గీ॥ విపులదోర్గర్వమునఁ జాల విఱ్ఱవీఁగి
తుది హరిశ్చంద్రుచే నిహతుండ వైతె?
పాంథనిర్మూలనోద్యోగపాపఫలము
కట్టికుడువక విడుచునా? కఠినకర్మ!

చంద్ర__నక్షత్రకా! మన కపాయము తొలఁగినది. నాపతి భూతాధముని గర్వ మడంచి వచ్చుచున్నారు.

విశ్వా__(స్వగతము) ఆహా! ఇతఁ డన్నిఁట సమర్థుఁడు. ఇంక నీతని సాధించుట నా తరము కాదు. కానీ, నాశక్తియంతయు నీతనికై ధారవోసెద. (నక్షత్రకుని సైగఁ జేసి నిలిచి) శిష్యా! వీరి నింక నిక్కడ నుండనీక ప్రయాణము సాగింపుము. పిమ్మటఁ గావింపవలసిన విధానముఁ జూచెద.

నక్ష__అలాగుననే.

హరి__(ప్రవేశించి) దేవీ! నక్షత్రకా! మీకు నిద్రాభంగము గలిగినదా?

చంద్ర__నాథా! మానిద్రాభంగముతోఁబాటు శత్రు గర్వభంగముగూడఁ గలిగి మీరు కుశలముగా నున్నారుగదా!

హరి__దేవీ! ధర్మదేవతవైన నీవు నాచెంత నుండ నా కుశలమున కేమి? కాని నక్షత్రకా! మన మింక నిశ్చింతతో నిద్దుర పోవచ్చును. ఇంకను నొకజాము రేయి యున్నట్లున్నది.

నక్ష__ఏమనుచున్నావు! నీకు మతిపోయినదా యేమి? న న్నిచ్చట నింకను బండు కొమ్మనుచున్నావా?

మ॥ బ్రతు కాసించినవాఁ డెవండు వినఁ డీ, వాక్యంబు, నేపాటి గం
డ్రతనం బున్నను నిట్టి దయ్యములతో,నా నీకుఁ జెల్గాట? మొం
డితనంబుం గడవెట్టి వే కదలు మ,ట్టి ప్రజ్ఞకై పెన్గులా
డితివా యిందఱిచావు నీవలన నేఁ,డే మూడు నిక్కంబుగన్.

ఇంక నీమాటలు చాలించి బయలుదేరుము.

హరి__అయ్యా! ఇంకను మీకుఁ బిశాచభయ మెందులకు? వాఁడు నాచేఁ గడతేఱి నాఁడు గదా!

నక్ష__వాని పరివారములోఁ గొన్ని మైమఱచి నిదురించుచున్న నాయెదురు ఱొమ్ముపై దుమికినవే, అవి యేమయ్యెననుకొంటివి? అప్పుడు బండి చక్రముక్రింద నలిగిన మొండిబండపురుగులాఁగున నెత్తురుగ్రక్కుచుఁ జచ్చిపోవలసినదే. ఇప్పుడుమీతో వేళ కన్నములేక యెంత చిక్కి యున్నను మా యాశ్రమములో నెల్లప్పుడు ఘృత సూపములతోఁ బెరిగిన మొండిప్రాణిని గావున ఱొమ్ముపై నెక్కి భూతములు తాండవమాడినను జావక బ్రతికియున్నాను.

హరి__నక్షత్రకా! నీ కీ పిటికితన మెక్కడనుండి వచ్చినది?

నక్ష—అది బ్రాహ్మణులకు సహజమని తెలిసియుండియు 'మాటిమాటికి నన్నేల యెగతాళి చేసెదవు ? నీ వేమన్నను నన్ను నాపిటికితనమే రక్షించుచున్నది. కాని నేను నీమాట విని యిక్కడ నుండను.

హరి—అయ్యా ! యీ గాఢాంధకారమున నెక్కడకుఁ బోవఁగలమయ్యా !

నక్ష—ఓరీ ! మాయావీ ! నీ వింతకు నిక్కడనుండి కదలవురా ? ఓ బాబూ ! నేను నీతో నేల వచ్చితినిరా ! కానీ—

ఉ॥ కుత్తుక బంటి యన్నమున, కుం జెడు నా కరకాసు రాని యీ
తొత్తరికంపుఁ బెత్తనము, తో నినుఁ గానల వెంబడించు నా
మెత్తదనాని కేడ్చుచును ♦ మేను దొలంగెదఁగాక యింక నా
యెత్తు ధనంబు వోసినను ♦ నే నిట నుండ నిమేష మేనియున్.

హరి—అయ్యా ! ఏల మీ కీ మరణభయము ?

క॥ రావలసియున్నఁ దప్పునె
చా వెచ్చట డాఁగియున్న జంతువులకు? ఛా
యావైఖరి వెనువెంటనె
యేవేళను గాచియుండు మృత్యువు విప్రా!

నక్ష—ఇప్పు డీ వేదాంత ప్రసంగములు జరుగుచుండగాఁ బిట్టపోరు పిట్టపోరు పిల్లి తీర్చినట్లు నన్నేదో యొక దయ్యము నోట వేసుకొనక మానదు. (భయ మభినయించి) అదిగో ! నే నన్నంత యైనది. రాజా ! చచ్చితినోయీ ! అవంక నొక దయ్యము గ్రుడ్లుఱుముచు నాపైకి వచ్చుచున్నది. దానికి బ్రాహ్మణదేహమాంసమే రుచి కాఁబోలు !

హరి—అయ్యా ! అది మిడుఁగుఱుఁబుర్వు కాని దయ్యము గాదు. అన్నియుఁ దెలిసిన నీకుఁ బ్రాణములపై నింతటి యాసకూడదు.

నక్ష—నీవు బ్రహ్మవేత్తవుకాఁబోలు! ఇట్టివాఁడ విప్పుడు కాఱుచిచ్చు వచ్చి కాళ్ళకుఁ జుట్టుకొన్న నీ ప్రాణరక్షణమునకై ప్రయత్నింతువా ? లేదా ?

హరి—మన ప్రయత్నముల ఫలాఫలములు విధి కనుకూలములై యుండును.

నక్ష—అయ్యో ! దైవమా ! ఈవల్లకాటి యరణ్యములో నీదయ్యాలవాతఁ బడుమని నానొసట నేల వ్రాసితివి? నే నిఁక నాలుకఁ బీకికొని చచ్చెదను. అమ్మా! ని న్నింక నేఁ జూడను. (నేలఁబడును)

హరి—నక్షత్రకా ! బయలుదేఱుము. దేవీ ! రమ్ము. (నడచుచున్నారు)

నక్ష—గట్టునఁ బడితిని. (నడచును)

చంద్ర—నాథా ! యెక్కడిదా వెలుతురు ?

నక్ష—ఏదైన కొఱివిదయ్యము మనవెంట బడినదేమో చూడుఁడు. దయ్యములమూఁతు లెట్లుగా నుండు నని మాయమ్మ చెప్పుచుండును.

హరి—కాదు కాదు. ఈయడవి యెక్కడనో కాలుచున్నది.

నక్ష—మనలఁగూడ దహింపదుగదా ?

చంద్ర—నాథా ! మనము దవాగ్ని మధ్యమునకే వచ్చినారము.

హరి—కటకటా ! యీ దావానలం బెంత భీషణముగా మండుచున్నది ?

మ॥ వియ దుద్ధ్వాంతనితాంతధూమపటలీ ♦ విస్తారితధ్వాంతమై
భయదావన్మృగమై నగాగ్రనిపత♦ద్వాచాలకాకోలమై
అయుతార్చిస్త్రుటితోరుకీచకనినా♦దాభీలమై, కీలి, హా !
లయకాలోగ్రజటాలకీలకకరా♦ళంబై వనం బేర్చెడున్.

లోహి—తండ్రీ ! ఈ మంటలు నామీఁదికే వచ్చుచున్నవి.

హరి—అయ్యో ! యేది యెట్లున్నను ముని ఋణము దీర్పకయే యీ దావానలంబునం బడి చావవలసి వచ్చెను. నక్షత్రకా ! నీగతి యేమి ?

ద్విపద; హిందూస్థానిభైరవి - ఆదితాళము.

చంద్ర—మతిమంత! నక్షత్ర; ♦ మానిమిత్తమున
గతియింపవలసె నీ♦కానలో నేఁడు

హరి— వనితరో! యీ ఘోర♦పాపంబు గూడ
కనులఁజూడక ముందుఁ ♦ గార్చిచ్చునందు
బడి సమర్పింతు నా ♦ ప్రాణాహుతులను
పడఁతి! యంతట శాంత♦పడు నేమొ యగ్ని

చంద్ర—హా! దయాగుణసాంద్ర ♦ హా! హరిశ్చంద్ర!
నీదాన నను వీడ ♦ నే నెందు బోదు?

హరి— కొడుకుతో నక్షత్ర♦కుని నెట్టులైన
జడదారి కిచ్చి నేఁ♦చ్చుటనైన బ్రతుకు

చంద్ర—ఇటులైన ముని ఋణం ♦ బెటు దీఱునయ్య
కటకటా! నే నెట్లు♦గాఁ దీర్పఁగలను?

అకలుషం బగు సత్య • మమరు మీ రున్న
సకలధర్మంబులు • సాఁగు మీ రున్న
పనికిమాలిన నాదు • బ్రతు కేమి లెక్క
చననిండు పదివేల • జన్మలకైన
నీవె నాపతిగాఁగ • నిటలాక్షు వేఁడి
పావకునకు నిచ్చి • నైతు నాతనువు.

(అని అగ్ని కెదురుగాఁ బోవుచున్నది.)

లోహి.—వలదమ్మ నీ వేగ • వలదమ్మ తల్లి!
యిల నాదు బ్రతు కేమి • హిత మమ్మ మీకు.

చంద్ర.—నాయనా! నీవు నాతోఁగూడ రాఁగూడదు. నీ తండ్రిగారి యొద్దకుఁ బొమ్ము.

(అగ్ని కభిముఖముగాఁ బ్రాంజలియై)

దండకము

శ్రీమన్మహాయజ్ఞమూర్తీ! జగజ్జాలరక్షా! ద్విషల్లోకశిక్షా! దురాలోక తేజోవిరాజీ! కృపాబ్ధీ! భవద్దివ్యచారిత్ర మెన్నంగ నే నెంతదానన్ సురారాధ్య! నీయందు వేదంబులున్ నాల్గు జన్మించుటం జేసి వేల్పుల్ నినున్ జాతవేదేతి నామంబులన్ భక్తిఁ బూజింతురీ నీచేత శిష్టాళికర్మంబులెల్లం బ్రవర్తించు దేవా! నినున్ రాజసూయాది యజ్ఞంబులందున్ బ్రపూజించియున్నట్టి మమ్ముం గృపన్ బ్రోవఁగాఁ జెల్లునే కాని బాధింపఁగా న్యాయమయ్యా! యిదే పాడియయ్యా! దయాభంగి యేమయ్యె నయ్యా, నిను న్నమ్మియున్నారమయ్యా, యరణ్యంబులన్ దిక్కులేకుండ నల్లాడు నీ దీనులన్ గాల్ప నీ కెట్టులౌనో విచారింతు, నేనేల సన్నిత్యసత్యవ్రతారూఢుఁడౌ శ్రీహరిశ్చంద్రభూపాలు నిల్లాలనే యైతినేనిన్ బ్రశస్తోరుసాధ్వీత్వమే నాకు వర్తించునేనిన్ నిమేషంబులోనన్ భవజ్జ్వాలికాజాలముం బాసి శాంతుండవై నవ్యనీహారవాఃపూరముం బోలి శైత్యంబునన్ గ్రాలవే వీతిహోత్రా! మునిస్తోత్రపాత్రా! నమస్తే! నమస్తే! నమః [అగ్ని చల్లారును]

విశ్వా—(స్వగతము) ఆహా! ఈ పతివ్రతామతల్లి ప్రభావంబునకు మామహిమంబు లెందులకుఁ గొఱగాకున్నవే. కాని వీ రింకఁ గాశీపట్టణమునకే చేరుదురు. అచ్చటి విధానం బాలోచింతు. (నిష్క్రమించును)

నక్ష—హరిశ్చంద్రా! నీ వింక బయలుదేరుము.

లోహి—అమ్మా! వచ్చితివా? (కౌగిలించుకొనును)

హరి—దేవీ! నీవలనగదా మేమందరము బ్రతుకఁ గలిగితిమి.

చంద్ర—నాథా! మీసత్యనిరూఢివలననే మన మందరము బ్రతికితిమి.

నక్ష—ఇఁకనైన మీ ముచ్చటలు చాలించి తిరిగి యేదేని నుపద్రవము రాకమున్నె బయలుదేరుఁడు. నడఁచినకొలఁది కాశి మనకు దూరమై పోవుచున్నది.

హరి—నక్షత్రకా! గంగానదీఘోషము వినంబడుచున్నది, వినుము.

మ॥ హరిపాదోద్భవ నౌట నాజలమునం ♦ దాప్లావముం జేసినన్
గురుపంకంబు లడంగు మీ కనుచు నా♦ఘోషించెడుం జూడు బం
ధుర గంధాచల గంధవాహ విచలో♦త్తుంగోర్మిజాలేతరే
తర సంఘట్టన జాయమాన తతరో♦దక్రాంత ఘోరార్భటిన్.

నక్ష—అది యెంతదూరమైన నట్లు వినంబడుచుండును.

హరి—అదిగో! విశ్వేశ్వరదేవాలయ గోపురము. చూడు,

మ॥ వినువీథిన్ మినుకంచుఁ గన్పడు నదే ♦ విశ్వేశదేవాలయా
గ్ర నిబద్ధోన్నత గోపురాగ్ర విలస♦ద్గాంగేయ శృంగంబు సు
మ్మ! నట ద్భీమ జటావిటంక విలుఠ ♦ న్మందాకినీ నిమ్నగా
కనకాంభోజపు మిద్దెయో యన బ్రభా♦క్రాంతాఖిలాశాంతమై.

నక్ష—అట్లయినఁ దొందరగా నడువుము.

(అందరు నడచుచున్నారు)

హరి—దేవీ! రమ్ము. (నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.



శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## పంచమాంకము

(సతీసుతులతో హరిశ్చంద్రుఁడు, నక్షత్రకుఁడును బ్రవేశించుచున్నారు)

హరి — దేవీ! కష్టము లెట్లున్నను బుణ్యక్షేత్రమైన వారణాశిం దర్శించితిమి. చూడు,

గీ॥ భక్తయోగపదన్యాసి • వారణాసి
భవదురితశాస్త్రవఖరాసి • వారణాసి
స్వర్ణదీతటసంభాసి • వారణాసి
పావనక్షేత్రముల వాసి • వారణాసి.

నక్షత్రకా! విశ్వేశ్వరు దర్శించి వత్తము. దేవీ! రమ్ము.

నక్ష — ఇఁక మాయప్పమాట నీకుఁ దోఁచదు, పద. (నడచుచున్నారు)

(యవనిక నెత్తఁగా దేవాలయము కాన్పించును. అందఱు విశ్వేశ్వరునకు నమస్కరింతురు)

హరి — (ప్రాంజలియై)

శ్లో॥ ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యో ఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః,
త్వయైవ క్షంతవ్యా శ్శివ! మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బంధుసరణిః.

శా॥ ఆపద్బంధుఁడ వీవు స్వామివిగదా! • యీలాటి యాపన్నులం
దేపారన్ బ్రముఖుండఁగా; మనకుఁ జంద్రశ్రీ! బాంధవం బింక వే
ఱే పల్కంబనిలేదు; గాన నిఁక నీవే సైచి నా నేరముల్
కాపాడందగు నెట్టులైన; నిటులేకా యోగ్యబంధుత్వముల్.

నక్ష — హరిశ్చంద్రా! ఇంక నెంతకాల మిట్లు ముక్కు పట్టుకొని కూర్చుండెదవు? రమ్ము.

చ॥ అలయక గుళ్ళుగోపురము, లన్నియుఁ జూచుచు నప్పుమాటయే
తలఁపవు, చేరువయ్యెనుగదా! గడువంచు రవంతయేని, లో
దలఁపవు, నాప్రయాసము వృథా యగుచున్నది వెళ్ళఁబెట్టుమా
పెలుచన మాఋణంబు నెగవేయఁదలంచిన నేను బోయెదన్.

హరి—అయ్యా, యెగవేయవలయునన్న నింతకష్టముల కేలయోర్చితి? తొందరపడకుము.

నక్ష—ఏమీ? సొమ్మీయవలసినవాఁడవు నీవు తొందరపడకపోఁగాఁ బుచ్చుకోవలసిన నన్నుఁగూడఁ దొందరపడవలదని నీతులు చెప్పుచున్నావుగా? బాగు! అన్నిటికిం గాళ్ళుసాఁచిన నీ కేమితొందర?

ఉ॥ పుట్టెడు నప్పుతోడఁ దల, మున్గితి వింకొకపుట్టెఁడైన నీ
పుట్టిమునుంగ డింతయును, బ్రొద్దున నీ మొగ మింత సూచినన్
బుట్టద యన్నముల్ మునిఁగిపోక ఋకేమిటి దీప ముండఁగా
నెట్టన జక్కఁబెట్టుకొన, నేరకపోయె గురూఁడు వెఱ్ఱియై

హరి—అయ్యా! నిష్ఠురము లాడకుము.

నక్ష—ఏమీ! మాకు రావలసినసొమ్ము మే మడుగుట నిష్ఠురమాయెనుగా? నీ వడుగు కొన్న నలుబది దినంబులు నేఁటితోఁ దీరుచున్నవే. ఇంతదనుక నా కిచ్చినదొక్క కాసైనలేదే? ఇంక నీవిచ్చెద వని మా కెట్లు నమ్మిక ముండును? ఇప్పుడుమాత్రము,

శా॥ ఏలీలన్ సవరింతు మాఋణము; కొంపే గోడియో? వింత కూ
డే లే దేమిటి? కింకఁ జంపెదవు సొమ్మీ మాకు నేనాఁటి బా
కీ లన్నన్నినుఁ గొట్టువాఁ డెవఁడు? చిక్కెన్నీకు మాజుట్టు; ప
త్రాలా? సాక్ష్యములా? నినున్ బలిమిమీఁ దన్ రచ్చకీడ్పింపఁగన్.

హరి—నక్షత్రకా! పత్రములును సాక్ష్యములు నేల కావలయు? సత్యస్థిరంబయిన నావాక్కున కన్యథాత్వ మెప్పటికైన సంభవింపదు గదా!

నక్ష—సంభవింపక నిప్పటికిఁ జేసిన దే మున్నది?

హరి—అయ్యా! నాదీనదశ యించుక యోచింపుము.

నక్ష—ఆలాగయిన నేను యోజించి చెప్పునది గట్టిగా వినుము.

శా॥ నీ కాతం డది యప్పువెట్టినది కానే కాద! యా మౌని ని
న్నేకైసాఁచి మఖార్థ మిమ్మనిన సొమ్మే కాని; యద్దానికై

నీ కన్నం గవదమ్మసల్లి యిట ము ♦ న్నే రాజ్య సర్వస్వమున్
జేకొన్నాఁ డిక నేఁటి యప్పు? నిజముం ♦ జింతింప నింతే కదా!

హరి__ఇంతియె కాని__‘నెలదినములలో నిచ్చెద’ నని యమ్మునితో నొప్పుకొంటిని గదా?

నక్ష__లేదనిన నామాట లన్నియు సున్న యగుం గాదే?

హరి__అయ్యా! సత్యేతరంబునకు నామానసం బొప్పునయ్యా!

నక్ష__అయ్యో! అమాయికుఁడా! ఇంత లోఁజెడ్డప్పుడుగూడ సత్యము సత్య మని యూఁగులాడు చున్నావే? హరిశ్చంద్రా! నీ వే మనుకొన్నను,

మ॥ జటినై నే ననరాదు కాని విను నీ ♦ సత్యంబె నీ కొంప కిం
తటిచేటునకు మూల; మిప్పటికి నై ♦ నన్ మించిపోలేదు, తీ
ర్పుట కేనాఁటి ఋణంబు మీ కనినఁ దీ ♦ ఋన్నీకు మాబాధ; యం
తట నూరేగుము సత్తుచిత్తనుచుఁ జిం ♦ తన్ బాసి వైరాగివై;

అట్లుకానిచో నింతధనము నీ విప్పట్టున నెట్లార్జించెదవు? చెప్పుము.

సీ॥ వైదికవృత్తి సం ♦ పాదింతు నంటివా
యుడుగవు రాచపో ♦ కడలు నీకు,
రాచరికంపు శౌ ♦ ర్యమునఁ దెత్తు వఁటన్న
దెసమాలి యేవంక ♦ దిక్కులేదు,
వణిజ వర్తనముచే ♦ గణియింతు నఁటివా
యరచేత గుడ్డిగ ♦ వ్వైన లేదు,
వ్యవసాయవృత్తిచే ♦ నవరింతు నంటివా
లేదు భూవసతి గో ♦ ష్పాదమంత,
ఇందు నేదేని వ్యాపార ♦ మందఁ దగిన
యంత పున్నెంబు పుట్టిన ♦ నింతధనము
గంటుకట్టుదె యీ స్వల్ప ♦ కాలమునను
గడచు నీనాఁటితోడ మా ♦ గడువుదినము.

ఇవి యేవియుఁగాక బానిసవృత్తికిఁ బాల్పడినను నిన్నెవ్వరు కొనువారు లేరు. కావున నా యుపదేశవాక్యముల ననుసరించి నీ వీ ఋణబాధ తప్పించుకొనుము. మా గురువుగారితో నీ దురవస్థయంతయుఁ జెప్పి యీసొమ్ము వదలివేయు తెఱం గొనరించెద. చెప్పుము. ఏల నీకీ బాధ?

హరి—నక్షత్రకా! నాకంతయుఁ గత్తిరించుచున్నను నసత్యమాడుటను నామనం బొప్పదు గదా!

నక్ష—హరిశ్చంద్రా! నీమేలుగోరి నేనింత వచించెద వినుము.

ఉ॥ పుట్టిన నాఁటనుండియును, బొంకి యెఱుంగవ? యే నెఱుంగు ది
ప్పట్టునఁ గూడులేని దుర, వస్థల నుంటివిగాన నీ మనం
బెట్టిటో తెంపుజేసుకొని, యీ యుపదేశము నాలకింపు మే
నొట్టిదుకొం దసత్యమున, కొప్పితివంచు వచింప నేరికిన్.

చంద్ర—నక్షత్రేశ్వరా! నీవంటి మునికుమారుఁడు చెప్పవలసిన నీతులా యివి?

నక్ష—చంద్రమతీ! నీవును నీ పెన్మిటికిం దగినట్లు దొరకినావు. పోనీ,

శా॥ మీనిప్పచ్చరముం దలంచి కరుణన్, మీ బాగుకై యింతగా
నే నేమో హితముల్ వచించితిని మీ, కే లేని యీ బాధ నా
కా? నీ పెన్మిటి నీ వెటైన విను నా, కౌ నేమి పోనేమి సు
స్నానంబో జపమో తపంబొ సదను, ష్ఠానంబొ యోజింపుమా.

చంద్రమతీ! నానీతులు మీరు విననక్కఱలేదు. ఊరక యడ్డపల్లలు వేసినట్లు కాదు. మాకు రావలసినసొమ్ము గవ్వలతోఁగూడ లెక్కగట్టి మా కిప్పింపుము. నే నింక క్షణమాఁగను. మీమీఁది మోమోటముచే నే నింకను నాలస్యము చేసినచో సహజముగా ముక్కోపియైన మాగురువుగారు నా గొంతుక కోయకక మానఁడు. హరిశ్చంద్రా! ఇఁక నీ పెద్దతికం బాలోచింపను. మాసొమ్ము గుమ్మరించి మఱీ నడువుము.

(చేయి పట్టుకొని నిలవేయుచున్నాఁడు)

హరి—(నిట్టూర్పువిడిచి) దేవీ! ఈ ఋణబాధ కడుంగడు దుర్భరముగద! చూడు,

మ॥ పరివారి న్నగుబాటు, పిమ్మట మన, శ్చాంచల్యరోగం, బనం
తర మాహారమునం దనిష్ట, మటుమీఁ, దల్ దేహజాడ్యం, బటన్
మరణాంబే శరణంబు పెక్కుదినము, ల్మంచాన జీర్ణించి; యిం
తిరో! యీ ప్రాణులకున్ ఋణవ్యధలకం, టెన్ దుస్సహాంబే దిఁకన్?

దేవీ! మందభాగ్యుఁడనైన నే నిప్పుడేమి చేయుదును? నిరవశేషముగా ఋణము దీర్చివేసికొని సంతోషించు భాగ్యము లేకపోయెనే!

చంద్ర—నాథా! మీ రిప్పట్టున ధైర్యము వహించి నా మనవి యాలింపుఁడు.

గీ॥ కాలగతి సర్వసంపద • ల్గోలుపోవ
మిగులుసిరి నాకు మీరును • మీకు నేనె
కానిసగ నన్ను నే కల•వానికేని
నమ్ముకొనుఁ డింక మానిబు•ణమ్ము దీఱు.

హరి__హా! విధీ! ఈ హరిశ్చంద్రునకు నెంతటియవస్థం దెచ్చిపెట్టితివి.

ఉ॥ అంతటి రాజచంద్రునకు • నాత్మజవై, కకుబంతకాంతవి
శ్రాంతయశోవిశాలుని త్రి•శంకునృపాలుని యిల్లు సొచ్చి, భా
స్వంతకులప్రసిద్ధి కొక•వన్నె ఘటించిన గేస్తురాండ్ర మే
ల్బంతిని నిన్ను నొక్కనికి • కానిసగాఁ దెగనమ్మికొందు నే?

చంద్ర__ప్రాణేశా! నీచంబని సంకోచింపవలదు. సత్య ప్రతిష్ఠకై యొనర్చిన నీచ కార్యంబులును సగౌరవంబులే యగు.

హరి__హా! జీవితేశ్వరీ! హా! సుగుణసుమవల్లీ! కఠినకర్ముండ నగు నే నెంతకుఁ జాలను? హృదయమా! నేటితో నభిమానము వదలివేయుము. దేవీ! చంద్రమతీ!

గీ॥ హృదయమున నెగ్గుసిగ్గులు • వదలివేసి
దాసిగా నిన్ను నమ్ముకో • దలఁచినాఁడ
వాడవాడల నిక గొను•వారి నూర
వెదకికొనఁబోవుదము ముందుఁ • బద లతాంగి!

చంద్ర__[నడచుచు] ఓ దేవా! కాశీవిశ్వనాథా! నన్నుఁ గొనువారిం ద్వరలో నగ పఱచి మమ్ము విశ్వామిత్రఋణబాధా విముక్తులను జేయుము తండ్రి!

నక్ష__హరిశ్చంద్రా! ఇదియే అంగడివీధి. ఇక్కడ ఒక్క కేక వేయుము.

హరి__దేవీ! నే నిప్పు డేమని ఘోషింపవలయును?

చంద్ర__క్రయధనమ్ము నమ్ముకొనువా రెట్లో యట్లే.

హరి__ఓహో, పౌరులారా! (కొంచె మూరకుండి) అయ్యో! యెంత నైచ్యమునకుఁ బాల్పడుచుంటి?

నక్ష__హరిశ్చంద్రా! ధనమిచ్చి కొనఁదగినవారంద ఱిక్కడనే యున్నారు. ఇఁక నీ యాగడములు సాలించి యందఱు వినున ట్లెలుంగెత్తి కేక వేయుము.

హరి__అయ్యా! నే నన్నింటికిఁ దెగించియేయున్నాను.

ద్విపద; రాగము - కీరవాణి - ఆటతాళము.

అవధారుఁడయ్య యో • యగ్రజులార!
సవనదీక్షితులార • క్షత్రియులార!
ద్రవిణేశు మించు ను • త్తమవైశ్యులార!
ప్రవిమలగుణగణ్య • పాదజులార!
కడ లాక్రమించి యొ • క్కటి భూమినేలి
నడిసన్న యా హరి • శ్చంద్రుండ నేను
ప్రణుత కౌశికఋణ • గ్రస్తుండ నగుట
గుణములదొంతి క • ల్కుల మేలుబంతి
పున్నెపింతుల యీలు • వున కోజబంతి
యన్నుల తలకట్టు • లందు సేమంతి
యగు; నాదు నిల్లాలి • హా! దయమాలి
తెగ నమ్మకొనుదు వీ • థిని దాసిగాను
చేరి రొక్కంబిచ్చి • చెల్వను గొనుఁడి
వారణాసీ పౌర • వరులార! మీరు.

మఱియు నో భాగ్యవంతులారా!

సీ॥ జవదాటి యెఱుఁగ దీ • యువతీలలామంబు
పతిమాట రతనాల • పైడిమూట
అడుగుదప్పియెఱుంగ • దత్తమామల యాజ్ఞ
కసమానభక్తి ది • వ్యానురక్తి
అణుమాత్రమైన బొం • కను మాట యెఱుఁగ దీ
కలుషవిహీన స • ర్వస్వలకు నైన
కోపం బెఱుంగ దీ • గుణవితాన నిశాంత
యొరులెంత తను దూఱు • చున్న నుంత

ఈ లతాంగి సమస్తభూ • పాలమకుట
భవ్యమణికాంతిశబలిత • పాదుఁడైన
సార్వభౌముని శ్రీ హరి • శ్చంద్రుభార్య
దాసిగా నీపెఁ గొనరయ్య • ధన్యులార!

[పిమ్మటఁ గేశవునితోఁ గాలకౌశికుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఓరీ! శిష్యా! కేశవా! యెక్కడరా బానిసల విక్రయించుచున్నది?

హరి—బ్రాహ్మణోత్తమా! ఇక్కడనే, మందభాగ్యుఁడనైన నేనే బానిసల విక్రయించుచున్నాఁడ.

కాల—అట్లయిన నీ వెవ్వఁడవు? ముందుఁ జెప్పుము.

హరి—నే నెవ్వండైన నీ కేమి?

కాల—ఏమోయీ, పేరుచెప్పుటకే సందేహించుచున్నావు. ఈ కాంతను నీ వెక్కడనో యెత్తుకొనివచ్చిన ట్లున్నావే? ఆఁ! నీ వే దొంగతనము చేసినను సాగివచ్చుటకు నీకాశీ కాపుర మంత యరాచకముగ నున్నదనుకొంటి వేమి? బోయవానికి రామచిలుక లాగున నీ కీ కాంత యెక్కడ చిక్కినది? ఘాతుకునంతవాఁడనైన నాకంటం బడి తప్పించుకొనిపోవుటకల్ల. (శిష్యునితో) ఓరీ! కేశవా! నీవు పోయి మనయూరితలారి పెద్ద యగు రామసింగును బిలిచికొని రమ్ము. ఈ ముచ్చును బట్టి యొప్పగింతము.

హరి—అయ్యా! విప్రోత్తమా!

గీ॥ ధరణిలో దొంగతనములో • దొరతనములొ
భాగ్యవంతున కేదైన • బాధలేదు
పెన్నిధి యదృష్టమున నిఱు • పేదవాని
కబ్బినను దొంగసొమ్మంట • కబ్బురంబె!

కాల—ఏమీ! నీ యదృష్టమునకుఁ దోడు నీ కీ కాంత యెక్కడో లభించినదా?

హరి—నాయదృష్టముచేతనే లభించినది. నేను హరిశ్చంద్రుఁడను. ఈయమ నాభార్య చంద్రమతి.

కాల—ఏలాగూ? విశ్వామిత్రున కప్పువడితి నని యఱచినది నీవేనా? ఆలాగైనఁ దపోధనుఁడైన నమ్మునికీ వెట్లు ఋణపడితివి?

హరి—నారాజ్యసర్వస్వ మా మునికి దారవోయునపుడు మ స్నాతనికి యజ్ఞార్థమై యిచ్చెద నన్న ధనము ముందుగా నిరూపింపక పోవుటవలన.

కాల—పత్రముఁ వ్రాసి పుచ్చుకొనినగాని యప్పుకాదుగదా! సాక్షు లెవరైన నున్నారా?

హరి—సత్యశీలమే పత్రము; మాయుభయుల చిత్తములే సాక్షులు.

కాల—ఓయి యమాయికుఁడా! ప్రాణములేని యీ పత్రమునకును సాక్ష్యమునకును భయంపడి నిక్షేపమువంటి యిల్లాలిని నమ్ముకొనుచున్నావా? (ఆలోచించి) ఉండుండుము, నా కిప్పుడు మంచియుపాయము తోఁచినది. నన్ను విశ్వామిత్రునొద్దకుఁ దీసికొనిపోయి యీధనము నీ కీయవలసినది కాదని పోరాడుము. నీపక్షమున నేను న్యాయవాదిత్వము గైకొని రాయిగ్రుద్దుచు వాదింపఁగలను. ఓహో! ఒకరికి బదులు సాక్షు లుంచినపత్రముల నెగవేయుటలోను, ద్రోవఁబోవువారిపై లేని యప్పులఁ గట్టి ధనముగణించుటలోను నన్ను మించినవాఁడు మఱొక్కఁడు నీకు దొరకఁడు. పద, నేను నీకు సహాయుఁడనైయుండ విశ్వామిత్రుఁడును గిశ్వామిత్రుఁడును నిన్నేమిచేయఁగలఁడో చూతము.

నక్ష—హరిశ్చంద్రా! నీ కిప్పుడు సహాయసంపత్తికూడ లభించినది. ఇఁక రమ్ము.

హరి—అయ్యలారా! మీరిరువురు మహాబ్రాహ్మణులుకాని యూరకుండుఁడు. నా కెవ్వరిసహాయ మక్కఱలేదు. నా సత్యమే నన్ను రక్షింపవలయును గాని,

మ॥ ఇటు లెంతైన ధనంబు వచ్చినను రానీ, గాధిరాట్ప్రీతి నా
కెటు కష్టంబులఁ దెచ్చునేనియును దేనీ, దివ్యభోగంబు లె
న్నిఁటి నా కా జడదారి యిచ్చినను నీనీ, సత్యముందప్ప నే
నిటు సూర్యుం డటు తోఁచెనేనియు వినుండీ మీరు ముమ్మాటికిన్.

కాల—ఓహో! నీ వెంత సత్యవంతుఁడవైనను ధనముపట్ల కొంచెము సడలు విడువవచ్చును. అందులకే "సర్వే జనాః కాంచన మాశ్రయంతే" యని పెద్దలు చెప్పుచున్నారు. నా యీ శాస్త్రప్రమాణ మంగీకరించి కౌశికునొద్దకు నడువుఁడు. చూడుము,

కం॥ ఆలాగునఁ గౌశికుఁడే
పాలయ్యె ధనాశ కింక, వల దుడుగుము నీ
కేలా! యీ వేదాంతము
పా లొల్లని పిల్లి గలదె, పరికింపంగన్.

హరి—అయ్యా! ఏల మీ కిన్ని మాటలు?

కాల—సరియే, నీకు బాగుపడుయోగము లేదు. తియ్యని చెఱకుపానకము నోఁట బోయుమండ విసమని వెడలుగ్రక్కువాని కెవ రేమి చెప్పఁగలరు? నీయిష్టము. నీభార్య నెంత కమ్మెదవు?

హరి—నక్షత్రకా! చెప్పుము.

నక్ష—ఓ కాలకౌశికుఁడా ! వినుము.

కం॥ దంతావళముపయిన్ బల
వంతుం డొక్కండు నిలిచి, పైకిన్ రతనం
బెంతటి దవ్వుగ రువ్వునొ
యంతటి యర్థంబు నిచ్చి, యతివం గొనుమీ.

కాల—ఓహో ! కేశవుఁడా ! ఇ దేమి చవుకబేరము కాదురా.

నక్ష—మఱి పంచాంగముకట్టకే వచ్చు నేమి ?

కాల—ఏమిరా చేడుగా ! మా యాయవారఁపుజోలె చూచి నన్ను ధనహీనునిగా గణించి నట్లున్నావు. కాని, దీని మాయింటికిఁ బంపివేయుము. ధన మిచ్చివేయుదును. హరిశ్చంద్రా ! సరియేకదా !

హరి—అయ్యా ! అట్లే.

కాల—దాసీ ! ఇటకు బడ! కుట్టా ! నడువుము. [బెత్తమున నదలించును]

చంద్ర—అయ్యా ! వచ్చుచున్నాను. [పతిపాదములపైఁ బడును]

కేశ—దాసీ ! నడువ వేమి ?

చంద్ర—హా ! మందభాగ్యనైన నేను నేఁటితో మీ దృష్టినుండి సయితము తొలఁగింపఁబడి పరాధీననై పోతినే ! ప్రాణపతీ, హరిశ్చంద్రా ! నా కింక దిక్కెవ్వరు ?

చం॥ పదపద యంచు బెత్తమున, బ్రాహ్మణుఁ డిట్లదలించుచుండినన్
బద మటు సాగకున్నది భవత్పదసారసభక్తియందు నె
మ్మది వశమౌట, చంద్రకరమర్దన మించుచు నుండినన్ బదిం
బదిగ మరందలోలయయి పద్మముఁ బాయని భృంగికైవడిన్.

అకటకటా ! ఇంక మిమ్ముఁ జూచుటకు నవకాశము నాకు లేదు. నాయజమానుఁ డింకను దొందరపడుచున్నాఁడు. ఈ స్వల్పకాలములోనే శుభదాయకం బగు మీ మూర్తిఁ గన్నులారఁ గాంచి పోయెదను. ప్రాణపతీ !

సీ॥ కదలవే యని విప్రుఁ, డదలించుటకు మున్ను
గనులార మీమోముఁ, గాన నిండు
పదవేమి యని పటుం, డదలించుటకు మున్నె
మీ నోటి నుడితేన, లాననిండు

నడువవేమని విప్రుఁ • డడలువెట్టకమున్నె
పొడము మీ కన్నీరుఁ • దుడువనిండు
సాగవేమని నటు • ల్లాగవచ్చుటకు ము
న్నింపుగా మిముఁ గౌఁగి • లింపనిండు
పరమకరుణాసనాథ! మ • త్ప్రాణనాథ!
కాలగతి మీకు దూరస్థు • రాల నగుచు
వెడలు కన్నీఁట బాదము • ల్గడిగి మీకుఁ
బ్రణతులిడుచున్నదాన స • ద్గుణనిధాన!

హరి—(నిర్వేదముతో) ఛీ, ఛీ, హరిశ్చంద్రా! నీవు నిక్క-ముగాఁ గిరాతునకు జన్మింప వలసినవాఁడవు గదా!

గీ॥ గళమునం దాల్పవలసిన • యలరుదండ
పాదమర్దన కొప్పించు • భంగిగాఁగ
అఖిలసామ్రాజ్యభోగంబు • లందఁదగిన
పట్టపుందేవి నమ్మితే • బానిసగను.

చంద్ర—హృదయేశ్వరా! నాకై మీరంతగా దుఃఖింపవలదు. విధివిధాన మెవ్వరు దప్పింతురు? దుఃఖ మడంచుకొని యీ కాలకౌశికుని సేవావృత్తికి నన్నుఁ సమ్మతించి పంపివేయుఁడు.

హరి—దేవీ! ఇప్పు డనుమతించుటేమి? ఆగర్భశ్రీమంతురాలవైన నిన్నుఁ బరున కెప్పుడు విక్రయించితినో యప్పుడే నాయనుమతులన్నియుఁ దీఱినవి. కాని,

మ॥ కనుసన్నన్ బనికత్తెలెల్ల నిరువం • కన్ గొల్వ రాణించు జీ
వనమేకాని యెరుంగ వెప్డుఁ బరసే • వాకృత్య మాజన్మమున్
వనితా! నేఁటికి నీకు నావలనఁ బ్రా • ప్తంబయ్యె నెట్లోపెదో?
ఘనదుర్దాంతదురంతదుస్సహమహో • గ్రక్రూరదాస్యంబునన్.

నీ! మానవతీమణీ! రాణివాసంపుభోగభాగ్యంబులకుం జెడి నూతనముగా దాసికావృత్తి నవలంబింపఁబోవుచున్న నీకుఁ గొంతచెప్పుచున్నాను. సావధానముగా నాకర్ణింపుము.

మ॥ తలిదండ్రుల్ మఱి వేఱ లేరిఁక సతీ! • తద్దంపతుల్గాక నీ
కిల, నీ వేమఱుపాటుసెందెదుసుమీ • యీ విప్రసేవాకృతిన్,

దొలి నీ వొందిన భోగభాగ్యములయందుఁ జిత్తముఁ నిల్పకే
తలలో నాలుకగా మెలంగుము నెలంతా! పిన్నలఁ బెద్దలన్.

మఱియు నో సాధ్వీమణీ! నీస్వామికడనే బానిసీఁడుగ నుండవలసినవాఁడుగాన గుజ్జువాని లోహితాస్యుని నెట్లుగాపాడుకొందువో? మనకు నేఁటితో దురంతమైన వియోగంబు సంభవించినదికదా! (లోహితాస్యునితో) నాయనా! లోహితాస్యా! నీవుగూడ నీతల్లి ననుసరించియుండవలసినవాఁడవే. కాన నావెంట రాకుము.

లోహి.__నాన్నగారూ! మీ రెందుకుఏడ్చుచున్నారు? మీరిప్పు డెక్కడకుఁబోయెదరు?

హరి.__నాయనా! నే నెక్కడ బానిసీఁడుగా నుండవలెనో యక్కడికే.

దీనవృత్తము; హిందూస్థాని భైరవి - ఏకతాళము.

లోహి.__జనకా! యిపు డెచ్చటికే గకుమా
నను నీ వెనువెంటను గొనిపొమ్మా
జననిఁ నను నిచ్చటి బ్రాహ్మణుఁడే
కొనిపోయిన మాకు సుఖంబగునే?

హరి.__తండ్రీ! (యెత్తుకొని) నీకు రావలసిన కష్టములా యివి?

మ॥ కొడుకా! కష్టము లెన్నివచ్చినను నీకు న్నాకు నాకీడులం
దెడఁబాటు ల్ఘటియింపకుండు టొక మేలే యంచు నే సంతసం
పడితింగాని యెఱుంగ నిన్నుఁ దెగనమ్మంజూపి హా లోహితా!
కడ కీ నాఁటికిఁ గాలసర్పమునకుం గైకోలుఁ గావించుటన్.

హా! తండ్రీ! నీ కమంగళము ప్రతిహతమగుఁగాక!

(మరల) కడ కీనాఁటికిఁ గాలకౌశికునకుఁ గైకోలు గావించుటన్.

దేవీ! నే నెంత దారుణమైన వాక్యమును బల్కితిని.

చంద్ర.__నాథా! మనకు దుఃఖము శాంతించును గాక!

గీ॥ కాలవశమునఁ గల్గిన కష్టచయము
లెల్ల వెంటనె నిలుచునే యేకరీతి
మిహిరమండలమును గప్పు మేఘపటలి
తూలిపోకుండునే యెల్లకాల మటులె?

అట్లే యచిరకాలమునకు మరల శుభములు వచ్చి పునస్సమాగమసౌఖ్యంబు లభింపక పోదు.

హరి—దేవీ! భవితవ్యమును నెవ్వ రెఱుంగుదురు? చూడుము,

మ॥ కలికీ! ఱెక్కలురాని పిల్లలను సాంకన్ గూటిలోనుండి మేఁ
తలకై పో తో కచెంతఁ బెంటిరెయొక చెంతన్ బాఱ నీలోనఁ బిం
ల్లలఁ బామే గ్రసియించునో వలలపాలన్ జిక్కునో పుల్గు, లీ
యిలపైఁ బ్రాణులకున్ వియోగమగుచో నెవ్వారి కెవ్వారలో.

కేశ—ఏమయ్యా! శుభమస్తు అని మాగురువుగారు దాసిని కొనుక్కొను టేమి, మీ రి ట్లశుభముగా నేడ్చుటేమిటి? పదపద. (అదలించును.)

లోహి—(కోపముతోఁ గేశవుని జూచి)

స్రగ్విణీవృత్తము; బేహాగ్ - ఆదితాళము.

ఏర; మాయమ్మ నిట్లీడ్వ నీ కేమిరా
క్రూర! ని న్నిప్పుడే గ్రుడ్డదన్ జూడరా
దూరమందుండి మాతోడ మాట్లాడరా
శూరునిన్ లోహితున్ జూచి నోర్మూయరా.

కేశ—ఓరీ! చెడుగా! దాసీపుత్రా! కూటికిలేకపోయినను నీ కింత రాజస మున్నదిరా?

(పడఁద్రోయును)

లోహి—(కన్నీరుగార్చుచుఁ దండ్రివంకఁ జూచును)

హరి—(దుఃఖముతోఁ గుమారు నెత్తుకొని) తండ్రీ! నీ కింత దురవస్థ వచ్చెనురా!

మ॥ కనుదోయిన్ బడి బాష్పము ల్దొరఁగ నాకై యేల వీక్షించె దో
తనయా! నేను మహాకిరాతుఁడ సమస్తద్వీపభూమండలీ
జననాథాళికి సార్వభౌముఁ డవు గాఁజాల్నిన్ను నీదాస్యపుం
బనికై యమ్మిన నాకు నెచ్చటి దయాప్రారంభవిస్రంభముల్.

కాల—ఓహో, యేమోయీ! ఇప్పుడే నీకొడుకి ట్లనుచున్నాఁడే; ఇఁక మాయిల్లలకల్లోలము చేయునా యేమి?

హరి—అయ్యా! ఇది కేవల బాల్యచాపల్యము. కాని నామనవియొక్కఁ డాలింపవలయును.

కాల—అది యేమి?

హరి— గీ॥ మీరు బిడ్డలఁ గని పెంచువారలైనఁ
గడుపుకక్కుఱితిని నింతఁగా వచింతుఁ

ప్రేమ నీ బిడ్డలం దొక బిడ్డగాఁగ
నరసికొనుమయ్య వీనిఁ గృపాంబురాశి !

(లోహితు నొప్పగించును)

కాల—సరి, నీ యప్పగింతలన్నియు నైనవా ? ఇంక మాదాసినిఁ బంపివేయుము. మాకు జాగగుచున్నది.

చంద్ర—(దుఃఖముతో) సరసాంకవృత్తములు - ఫీలురాగము.

సెలవిచ్చి నన్ననుపుఁడీ క్షితిపాలచంద్రా!
వలవంతఁ జెంద కిఁక పావనసత్యసాంద్రా!

హరి— కలకాల మీగతిని దుఃఖముతో సుశీలా!
తలపెట్టు లూఁఅడిలు నింతట ముద్దరాలా!

చంద్ర— ఇఁక జాగుచేయఁదగ దో నృపసార్వభౌమా !
సకలం బెఱింగి యిటు లెన్నరె పుణ్యధామా!

హరి— అకలంకశీల! నిను నిట్లలయించినాఁడన్
మొకమెత్తి యెట్లు మననోపుదు సిగ్గుతోడన్.

కాల—ఓహో ! మీయేడ్పులతో మా పనులన్నియుఁ జెడుచున్నవి. దాసీ ! కదల వేమి? మూట లెత్తికొని రమ్ము.

చంద్ర—(లోహితాస్యునితోఁ దిరిగి తిరిగి పతిం జూచుచుఁ బోవుచున్నది)

కాల—నక్షత్రకా ! ధనమిచ్చెద రమ్ము.

హరి—హా ! హా ! నాపుణ్యలక్ష్మి దాఁటిపోయినది.

నక్ష—హరిశ్చంద్రా! నీవు విశ్వేశ్వరదేవాలయమునొద్ద నుండుము. నేను ధనమందికొని వత్తును. (కాలకౌశికునితో నిష్క్రమించును)

[పిమ్మట యవనిక యెత్తగాఁ గాలకంటకి గృహద్వారముకడఁ బ్రవేశించును]

కాలకం—ఓరీ, యెవఁడురా? కేశవా ! జనార్దనా ! అంగడికిఁ బోయిన మాయాయన యింకను రాలేదు గా? కానీ.

[కాలకౌశికుఁడు, కేశవుఁడు, చంద్రమతి, లోహితాస్యుఁడును బ్రవేశించుచున్నారు.]

కాలకా—ఓరీ, కేశవా ! అదిగో నచ్చుచున్నదిరో.

కేశ—అయ్యా ! ఈనాఁడు మీ గ్రహచారమంత గా బాగున్నట్లు తోఁచదు.

కాలకౌ__ఏమోరా నాయనా! నీవు మాత్రము మాముండతో నామీదఁ గొండెములు చెప్పకేమి? (యిల్లు చేరుదురు)

కాలకం__వచ్చుచున్నావు, రా. రా. (సమీపించును)

చంద్ర__అకటకటా! ఏమీ, ధూర్తమైన యీ విప్రాంగనవర్తనము! ఈవిడయే నా యజమానురాలు కాఁబోలు!

కాలకం__దుర్మార్గుఁడా! నీ విల్లుకదలి యెంతసేపైనది? నీ కొఱకై ప్రొయార్పకొని నేను కనిపెట్టుకొని యుండవలసినదా? ఈమధ్య నీకుఁ బొత్తుగా బ్రాయశ్చిత్తకర్మలు లేకుండ నున్నవి. నేఁడు నీకు మూఁడినది కాని, చెప్పు!

కీర్తన; ఫరజు - త్రిశ్రగతి.

ఇంతప్రొద్దెక్కినదాఁక నీ వెక్కడనుంటివి యింటికి రాక॥ఇం॥

కాలకౌ—యీాయవార మెత్తినాఁడ నంతపోయి శవాలను మోసివచ్చి నాఁడ॥యీా॥

కాలకం—తెచ్చినడబ్బేదో తెమ్ము నీముచ్చుపోకిళ్ళను మెచ్చ రారమ్మ॥

కాలకౌ—మూఁడేమాడలఁ దెచ్చినాఁడనీతోడునాకింకనుదొరకలేదేవాడ

కాలకం—అల్లైన నే నూరుకోను నీపొట్టబ్రద్దలుచేసి నెట్టివేయకపోను॥

(కొట్టుచున్నది)

కాలకౌ—అబ్బబ్బ నే నోర్వలేను యీాడబ్బునకు రెప యిబ్బడిచ్చెనే॥

కాలకం__నీ వింక జాగరూకతతో మెలంగకున్న నీగతి యింతియే.

కేశ__అమ్మా! కాలకంటకీ! నేఁ డప్పుడే వదలిపెట్టినా వేమి? ఇక్కడ చూడు. (చంద్రమతీ లోహితాస్యులను జూపించును)

కాలకౌ__ఓరీ కేశవా! నీపుణ్యము, నీ వూరుకోరా. (గడ్డముపట్టి బ్రతిమాలును)

కాలకం__ఇఁక నేనూరుకోను. ఈనిర్భాగ్యురా లెవరు? చెప్పు. (కొట్టును)

కాలకౌ__(గట్టిగా చేతులు పట్టుకొనుచు) నీ కడుపుడుక, యింక చంపకే.

కాలకం__ఓరీ, నీ చేతులు కాలిపోను! నీశక్తి మండిపోను! ముసలితనము వచ్చినను నీ కెంత మద మున్నదిరా? ఓ యెవరయ్యా! నన్ను నామగఁడు చంపుచున్నాఁడు. రండయ్యా! (కేకలు వేయుచున్నది)

కాలకౌ__(నోరుమూయుచు) ఓసీ నీపుణ్యము, అఱవకే. సుకుమారివి నీ వింటిలోఁ బని చేసికొలే పని దాసినిఁ దెచ్చినాఁడను.

కాలకం__ఆమాట మొదటనే యేడువరాదా?

చంద్ర__అమ్మా! కాలకంఠి! ఇది యే మన్యాయ మమ్మా?

క॥ పతిఁ గడవ సతికి లే దొక
గతి, యెంతం డెంత మనకుఁ, గైవసమైనన్
మితి గలదు చనవునకు నీ
గతిఁ బ్రతికూలతకుఁ బాలుగాఁ దగు నమ్మా!

శా॥ ప్రత్యూషంబున లేచి నాథుని పదాబ్జాతంబులన్ వ్రాలుటో,
పత్యుద్దేశ్య మెఱింగి భోనముల సంభాళించుటో, రాకకున్
బ్రత్యుత్థానమొనర్చి మెచ్చఁదగు సేవల్ సేయుటో, కాకిటుల్
ప్రత్యాఖ్యాన మొనర్తురమ్మ సతముల్ పత్యాజ్ఞకున్ గేహినుల్?

మఱియు,

మ॥ పడఁతీ! నే నొకపాటిగాను వచియింపన్ నీవిభుం డెంత నీ
యడుగుందాఁటఁడయేని బత్తి మిగులన్ హత్తించి, బంగారమే
యొడలెల్లన్ దిగవేయునట్లుగను నీ వోరంత ప్రొద్దెల్ల మే
లడపాలూనుము, కాళులొత్తు మటుగా దాసీవరుల్ వీచుమా.

కాలకం__ఓహో! నీ వెవ్వతెవే? నాకుఁజక్కట్లుదిద్దుటకేనా నామగఁడు నిన్నుఁదీసికొని వచ్చినది? ఓహో! దాసివైవచ్చి దొరసానివైతివి? నీకుఁ దెలిసిన మగనాలివర్తనాలు మాకుఁ దెలియవేమి? కూఁటికివచ్చినదానవు చచ్చినట్లు పడియుండక సారంగనీతులు చెప్పుచు నామాటలోఁబడియున్న నామగనిబుద్ధి చెడగొట్టుచున్నావుగా.

కాలకౌ__చంద్రమతీ! నీ వెప్పుడు మాయాబిడతో నిట్లుమాటాడరాదు. (రహస్యముగా) దీని నోటికి యూరి కరణాలు కాఁపులుగూడ వెఱచుచుందురు.

చంద్ర__అయ్యా! నే నూరకున్నాను.

కాలకౌ__ఓసీ! యింటిదానా! నీతో నింత నిర్భయముగా మాటాడిన యీదాసికిఁ దగిన పనులు నియమించి నీకసి దీర్చికొమ్మా.

కాలకం__ అట్లైన పద. నీపని చెప్పెదను. (అందరు నిష్క్రమింతురు

[పిమ్మట నక్షత్రకద్వితీయుఁడై హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

హరి__నక్షత్రేశ్వరా! న న్నింత యన్యాయము చేసెదవా?

నక్ష—అడవులలో నన్నినా శృన్నను నీళ్ళకును మొగము వాచునట్లు చేయుట నీది యన్యాయము కాదుగాని న్యాయముగా నాకు రావలసిన బత్తెము నేను తీసికొనుట యన్యాయ మయ్యెనేమి? ఎట్లు?

ఉ॥ బత్తెము లేక త్రోవల విపత్తుల కోర్చుచుఁ దిండికేనియున్
బొత్తుగ వాచిపోయి గృహంబును విడి నీవెనువెంట రాను నీ
త్తొత్తునె? యింతకంటెను గతు ల్మఱి మా కిఁక లేవె! యేరికేన్
మెత్తనివానిఁ జూచునెడ మిక్కిలి మొత్తఁగఁ జిత్తమౌఁగదా!

హరి—నక్షత్రకా! మాగురువుగారి పనిమీఁద నీవు నావెంటవచ్చితివి కాని నాకొఱకై వచ్చితివా? నావలన బత్తెమే నీవు తీసికొనిన నీవు నీగురువునకుఁ జేసినయుపకార మే మున్నది?

నక్ష—ఓయి దుర్మార్గుఁడా! ఏ మన్నావూ? నేను నాగురువునకుఁ జేసిన యుపకార మే మనియా?

ఉ॥ ఆన దొలంగి ప్రాణములకైనఁ దెగించుచు నిట్టిబత్తెపుం
గాసుల నాసచే దరువు కానిగ నీపయి ఘోరకాననా
వాసమొనర్ప నొప్పుకొని వచ్చుటె నా యుపకార మా తపో
భ్యాసికి; నావలెన్ నటుఁడెవండిటు నెత్తురుకూటి కొప్పెడిన్?

ఇప్పుడు నాగురుభక్తినిగూడ నధిక్షేపించుచున్నావుగా? నీ వేమైన ననుము. నీభార్య నమ్మఁగా వచ్చిన యీ ధనము బత్తెముక్రిందఁ జెల్లవలసినదే కాన నిఁక మాగురువుగారి ఋణ మిప్పుడే యిచ్చివేయుము.

హరి—వటూత్తమా! నే నిప్పుడింత ధన మెక్కడనుండి తెత్తునయ్యా?

గీ॥ విమలశీలను నిల్లాలి విక్రయించి
చేర్చిన ధనంబు నీచేతఁ జిక్కెనుగద!
అవని స్వశరీరమాత్రుఁడై భవుఁడ నగుచు
బ్రతుకుచున్నట్టి నే నెట్లు బత్తె మిత్తు?

నక్ష—నీ విట్టి నిర్భాగ్యుఁడ వనియే నేను దీపముండగనే చక్కఁబెట్టుకొన్నాఁడ. ఓ హరిశ్చంద్రా! ఇటు వినుము.

గీ॥ నాకు రానున్న బత్తెంపురూక లెటులొ
స్వీకరించితి నే నిల్లు చేరవచ్చు

ముని ఋణమునకు మీరు మీ◆రును బేనంగి
తుదకు నే గంగలో నైన ◆ దుముకఁ బొందు.

[పోవుచున్నాఁడు]

హరి—[చేయి పట్టుకొని] నక్షత్రికా! నీ కిది బొత్తుగాఁ దగని పని.

నక్ష—ఏమోయి చేయిపట్టుకొనుచున్నావు? నన్ను గొట్టుదువా యేమి?

హరి—అయ్యా! నే నంత సాహసిని గాను.

నక్ష—కాకున్న నా చేయి విడువుము.

హరి—విడిచితిని! ఇఁక నాసొమ్ము మీ గురువున కిచ్చివేయుము.

నక్ష—హరిశ్చంద్రా! నే నిన్నిమాటల వాఁడను కాను.

క॥ అడియాస విడువు మిఁక, నా
యొడలిఁ జీవంబు లున్న ◆ నొడమిక విడువన్,
జెడ నెంచితేని విను నా
మెడ నీ యడిదమునఁ గోయు◆మీ, రో గొనుమీ.

హరి—నక్షత్రికా! ఇంతకన్న నేఁ జెడున దేఁమున్నది? నన్నుఁగూడ నమ్మికొని మీగురుఋణంబు రాఁ బట్టుకొనుము.

నక్ష—ని న్నెవ్వ రిచ్చటఁ గొందురు?

హరి—ఎవ్వరుఁ గొనకున్నఁ గడకుఁ గడజాతివానికైన నమ్మివేయుము.

నక్ష—సరి, నిన్నుఁ గాదన నేల? రమ్ము. [నడచుచు]

ద్విపద; రాగము — కీరవాణి — అటతాళము

అవధారుఁ డయ్య యో ◆ యగ్రజులార!
సవనదీక్షితులార ◆ క్షత్రియులార!
ద్రవిణేశు మించు న◆త్తమవైశ్యులార!
ప్రవిమలగుణధన్య◆పాదజులార!
కడ లాక్రమించి యొ◆క్కట భూమి నేలి
నడిపిన్న యా హరి◆శ్చంద్రుండు నేఁడు
బానిసీఁడుగ నమ్మఁ◆బడుచున్నవాఁడు
మానసీయుఁడు సత్య◆మార్గధీరుండు

కోరినధన మిచ్చి • కొనఁదగుసుండి,
వారణాసీ పౌర•వరులార! రండి.

[ఆకసమువంకఁ జూచి] ఏమీ, ఈతఁ డెట్టివాఁ డనుచున్నారా?

సీ॥ తన మహీరాజ్యమం•తయు గాధిసూతికిఁ
దాన మిచ్చినయట్టి • ధర్మరాజు,
నిజయశశ్చంద్రికల్ • నిఖిలదిక్కులయందుఁ
బాఱఁజల్లినయట్టి • సారగుణుఁడు,
ముల్లోకములును స•మ్మోదింప భేతాళు
మద మడంచిన విక్ర•మస్థిరుండు,
అణుమాత్రమైన బొంఁ•కనుమాట యెఱుఁగని
యసమాననిత్యస•త్యవ్రతుండు,
ఏడుదీవులు నయలీల • నేలినట్టి
సాంద్రకీర్తి హరిశ్చంద్ర•చక్రవర్తి
భానిసీఁడుగ నమ్మంగఁ•బడెడు కొనుఁడు
పౌరులార! మహాధనో•దారులార!

హరిశ్చంద్రా! ఎవ్వరు కొనకున్నారు. ఇం కెంతని యఱచెదను. వీఁ డెవఁడో కడ జాతివానివలె నున్నాఁడు. ఇటె వచ్చుచున్నాఁడు. ఉండుము.

[పిమ్మట వీరబాహు ప్రవేశించు చున్నాఁడు]

గేయము

తొలగి పోనిండయ్యా • దొరలు పెద్దింటోన్ని
తెలిచి సెప్పకుంటే • పలువా పొమ్మంటారు ॥తొ॥
పబులు మీఁకుక్కల • కట్టి వేస్కోండయ్యా
గబగబ బౌ వంచు • కఱవ వత్తుండయ్యొ ॥తొ॥
వాచనంటారు మా•దోచ మంటారు నే
కాచంత కల్లేసి • కాటికి పోతుండ ॥తొ॥

సత్య—హరిశ్చంద్రా! ఇంక ని న్నెవ్వరు కొందురు?

వీర—దొరా! జానిసోణ్ణి అమ్మ్రతుండావా? నే గొంటూనండి. దర సెప్పండి.

నక్ష—చెప్పెదనుగాని నీవు దూరముగా నుండి మాటాడుము. నే నిప్పుడు స్నానము చేయలేను.

వీర—దూరంగానే వుండానుండి, సెప్పండి.

హరి—నక్షత్రకా! న న్నీ కడజాతివానికే యమ్మెదవా?

వీర—కడజాతి యేముండీ, పెద్దింటోణ్ణి.

నక్ష—హరిశ్చంద్రా! ఎవ్వరుఁ గొనకున్న న న్నేమి చేయుమందువు? మొత్తము మీద నీవు నా కిచ్చు బత్తెమునకు దండుగ లేకుండ నాపలనఁ బని పుచ్చుకొను చున్నావు. అఱచి యఱచి గొంతు పగిలిపోవుచున్నది. తిరిగి తిరిగి కాళ్ళు పడిపోవుచున్నవి.

హరి—అయ్యా, వీనికే విక్రయింపుఁడు. నే నన్నిటికి సిద్ధుఁడనై యున్నాను.

నక్ష—ఓరీ, వీరబాహూ! నీ కీతఁడు కావలయు నన్న,

కం॥ దంతావళముపయిఁ బల
వంతుం డొక్కండు నిలిచి పైకిఁ రతనం
బెంతటి దవ్వుగ రువ్వునొ
యంతటి యర్థం బొసంగు మా కొనిపొమ్మా!

వీర—వోరబ్బో! సాలదాఁకుండదే!

నక్ష—ఇఁక నే మనుకొన్నావు? వీరబాహూ! నీచేతగాదు పోరా.

వీర—అయ్యోరూ! యిట్టుండావని నూత్తుండావు కామాసు! డబ్బిత్తారా. రావయ్యా, అరిచ్చంద్రుఁడా!

నక్ష—హరిశ్చంద్రా! ఇఁక బొమ్ము. నీ ఋణము తీఱినది.

హరి—నక్షత్రేశ్వరా! నే నింక సెలవు పుచ్చుకొనియెద. ఎక్కడనో నిశ్చింతతోఁ దపం బాచరించుకొను నీవుగూడ నామూలమున ఘోరారణ్యంబులఁ బడరానిపాట్లు పడితివి. నన్ను క్షమింపుఁడు. వటూత్తమా! నమస్కారము.

నక్ష—(స్వగతము) అయ్యో! నే నిప్పు డేమని యీధర్మమూర్తికిఁ బ్రత్యుత్తరమిచ్చెదను? ఇట్టి పరమశాంతుని సత్యవంతుని నే నెంత చేసితిని! (ప్రకాశముగా) హరిశ్చంద్రా! నేనే నీ కన్నివిధములఁ గష్టములఁ దెచ్చి పెట్టిన దుష్టుఁడను. నేను నిన్నడుగుకొవలసిన క్షమాపణమును నీవు నన్నడుగుచున్నావు. అయినను బుట్టినదాది ననన్య సామాన్యమైన సత్యనిష్ఠాగరిష్ఠతచేఁ బరిశుద్ధమైన నీమానసమున కింతటి క్షోభదెచ్చి పెట్టిన నాయట్టి ఘోరకర్ముఁడు శిక్షార్హుండు గాని క్షమాపణమునకుఁ దగునా?

హరి—అయ్యో! విప్రోత్తమా! శిక్షించుటకుఁగాని క్షమించుటకుఁగాని నే నెంతటి వాఁడను! వటుశిఖామణీ! నీ కిదే వందనము. (నమస్కరించును)

నక్ష—(లేవనెత్తి)

చ॥ కలత వహింపకయ్య కల కాలము కష్టము లుండఁబోవు, కా
వలసిన కారణార్థము లవంబును దప్పునె? నా యకృత్యముల్
దలఁపున నుంచకయ్య విహితమ్మనన్ క్షమియింపుమయ్య నా
కలుషమె యింత కింత కధికమ్మయి న న్వధియింపకుండునే.

హరి—అయ్యో! మీరు చేసిన దే మున్నది? నాపూర్వభవసంచితపాపఫలమే నన్నీ కష్టంబులకుఁ దెచ్చె.

నక్ష—రాజేంద్రా! సత్యసంధుఁడవైన నీ కెప్పటికిని గష్టములు లేవు. చూడు,

మ॥ కడఁకన్ గావలెనంచు సత్యఫలముం గాంక్షించి నీవే యొడం
బడి కైకొన్న విపత్తులం బరితపింపన్ గూడ దయ్యో కడుం
గడు దోసం బని నే నెఱింగియు వృథా క్రౌర్యంబునన్ నీయెడన్
జెడుగు ల్సేయుట కెంతగుందితినొ నా చిత్తంబె తా సాక్షియా.

హరి—నక్షత్రేశ్వరా! దుఃఖింపకుము. పరమేశ్వరుఁడు నిన్ను రక్షించుఁగాక! వటూత్తమా! నా కింక సెల వొసంగుఁడు.

వీర—రావయ్యో! అరిచ్చంద్రుఁడా! కుండెత్తు కొత్తుండావా?

హరి—అయ్యా! వచ్చుచున్నాను.

వీర—అశే అబ్బిగా! మద్దానూ! యింటికాడికి మనోణ్ణి తీసుకుపో. బాప్నోడికి సొమ్మిప్పింతాను.

నక్ష—(స్వగతము) అయ్యో! నే నెంత కపట కృత్యముల నభినయించితిని? నన్నీయకార్యమున నియమించునప్పుడు భగవానుఁడైన విశ్వామిత్రుఁడు నే నిట్టి రట్టునకుఁ బాలగుదు నని తలంపఁ డయ్యెఁగదా! ఇనుమును బట్టి యగ్నికి సమ్మెటపెట్లన్నట్లు గురూత్తమా! మీవల్లనగదా నే నిట్టిపని కొడిగట్టవలసివచ్చె. మీయాజ్ఞానువర్తినై నిత్యసత్యకీర్తియగు హరిశ్చంద్ర చక్రవర్తికి లెక్కలేని యిక్కట్టులఁ జేసేతఁ దెచ్చిపెట్టి నేను మీకుఁ జెల్లింపవలసిన గురుదక్షిణ నిశ్శేషముగాఁ జెల్లించుకొంటిని. కాని నే నిప్పు డన్నివిధముల దిక్కుమాలినవాఁడనై ప్రపంచమునకు రోసి చావక బ్రతికియుం

న్నాను. ఇంకను నాకుఁ దపం బేందుకు? ఎన్ని మన్వంతరములు తపం బొనరించి నను నా యీ దుష్కృతి నిష్కృతి యగు టెట్లు? హా దీనబంధూ!

గీ॥ గురుతిరస్కృతి తగ దను, కొనుట యొకటి
యతని కార్యంబు నెఱవేర్తు, ననుట యొకటి
యింత నిందకు నర్ల ద్రోచె, నేను జనిస
పాయ కది నిల్చు నెన్ని కల్పములకైన.

నే నిప్పు డేమి సేయుదు? నా కింక దిక్కెవ్వరు? నాపాపంబునకుఁ బ్రాయశ్చిత్త మెద్ది? భగవానుఁడా! విశ్వపతీ !

శా॥ ఏయేధర్మము లాచరింపనగు నే, యే క్షేత్రము లెట్టినా
నేయే తీర్థములందుఁ గ్రుంకనగు నే, యే దేవతం గొల్వనా
నా యీ పాపము దప్పిపోవుట కనంతా! దీనబంధూ! కృపా
భూ! యాపన్నుఁడ నీవె దిక్కగుము కొల్తు న్నిన్ను విశ్వేశ్వరా!

ఇంక దుఃఖించిన నేమి ప్రయోజనము? మా యుపాధ్యాయుఁ డైనను దుర ద్దేశ్యముతో హరిశ్చంద్రుని బాధించుచున్నాఁ డనుకొనను. తనవైరి యగు వసిష్ఠుని సాధించుట కింత నేయుచున్నాఁడు. ఏది యెట్లున్నను మహానుభావుఁడైన హరిశ్చంద్రుని దుఃఖములు తలంచినచో వజ్రకాఠిన్యహృదయములు సయితము నవనీత సమానములు కాకపోవు. పాప మా లోహితాస్యుఁ డా కాలకౌశికుని సేవానిర్బంధమున నె ట్లున్నాఁడో? దైవమా! సర్వథా హరిశ్చంద్రునికిఁ దోడుపడుము. తోడు పడుము. (ప్రకాశముగా) వీరబాహూ! ధన మిప్పింతువుగాని పద.

వీర—అయ్యోర్యా! రండి. (నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



శ్రీరస్తు

# సత్యహరిశ్చంద్రీయము

## షష్ఠాంకము

రంగము: కాశీపుర శ్మశాన పరిసరారణ్యము.

(పిమ్మటఁ గాలకౌశికుని శిష్యులగు కేశవ జనార్దనులతో లోహితాస్యుఁడు ప్రవేశించుచున్నాఁడు)

గేయము - పార్శీమెట్టు

అందరు — ఆటలాడుదమా చెండాట లాడుదమా
వాటమైన త్రొక్కుడు బిళ్లాటలాడుదమా ॥ఆట॥
చెట్టులెక్కుదమా లేక గుట్టలెక్కుదమా
అట్టునిట్టు జారుగుబండలందు జాఱుదమా ॥ఆట॥
కూఁతవెట్టుచు దాఁగిలిమూఁత లాడుదమా
ఆతరువుక్రింద గోలీ లాటలాడుదమా ॥ఆ॥

లోహి — మిత్రులారా!

గీ॥ ఆటలకు వేళలేదు సాయంతనంపు
టగ్నిహోత్రములకు వేళ యయ్యె నిప్పు
డయ్యవారలు ముక్కోపు లగుట మీకుఁ
దెలియునేకద! రండు దర్భలను గోయ.

కేశ — జనార్దనుఁడా! పాపము! లోహితాస్యునికి నాఁ డెన్ని దెబ్బలు తగిలినవిరా! అందునకే వీఁడు భయపడుచున్నాఁడు.

జనా — మనలనుగూడఁ గొట్టునేమో రండు. తల కొకదారిం బోయి దర్భలఁ బత్రములఁ గోసెదము. (అట్లు చేయుచున్నారు)

లోహి — (నడిచి పూలఁగోసి) ఈ పూలతావి చక్కఁగా నున్నది. ఇవి మా కాలకంటకికై తీసికొనిపోయెదను. అవిగో నీపుట్టమీఁద దర్భలు బాగుగాఁ బెరిగినవి. అందఱి

కంటె నే నే యెక్కువ దర్భలను గోసెదను. (పుట్టనెక్కి కోయుచుండఁ బాము కఱచును) హా!తల్లీ! హా! మిత్రులారా! నన్నొక్కపెను బాము కఱచినది(పడిపోవును).

అందఱు__(బరువెత్తుకొని వచ్చి) నెచ్చెలీ! నీ కేమైనది?

లోహి__అన్నలారా ! ఇంకేమి కావలయును? న న్నొక్కపాము కఱచినది. ఇంక మాయమ్మను జూచు భాగ్యము నాకు లేదు.

కేశ__అయ్యో! అయ్యో! నీ కెంతకష్టము వచ్చెను! జనార్దనా! పాపము! వీనికి మత్తు వచ్చుచున్నది. చెమటలు శరీరమునుండి యూఱక కాఱుచున్నవి. నోట నురుగులు పడుచున్నవి. కొంతవడి విసరనైన విసరుదము. (అట్లు చేయుచుండ)

లోహి__(కొంచెము తేఱి) అన్నలారా! చింతింపకుఁడు. నాయదృష్టమునకు మీ రేమి చేయఁగలరు? మీ రిక్కడ నామూలమున మసలవలదు. మీకు మాటవచ్చును.

సీ॥ జాగయ్యెనని కొట్టు♦నో గురుం డట మిమ్ము
నిచట నుండక యింటి ♦ కేగరయ్య,
అతిభక్తి మీకు లో♦హితుఁ డంపినాఁ డని
యీకుశ ల్గురున కం♦దీయరయ్య,
సదయుడై నారాక ♦ కెదురుసూచెడి తల్లి
కీ నాదుగతి వచి♦యింపరయ్య,
యేదిక్కులేక నే♦నే లోకమనియున్న
జనని దుఃఖముబాపి ♦ మనుపరయ్య,
వీలుగా నున్న నురునొప్పు♦కోలుమీఁద
నమ్మ నొకసారి చూచి పో♦మ్మందురయ్య,
విసము తలకెక్కె నేను జీ♦వింపనయ్య,
కడ కిదే మీకు నా నమ♦స్కారమయ్య!

నెచ్చెలులారా! నా ప్రాణములు లేచిపోవుచున్నవి! మీ రింకఁబొండు. హా! తల్లీ! నీవైన నాదగ్గఱ లేకుంటివే? (మూర్ఛిల్లును)

జనా__అయ్యో! అయ్యో! ఎంతపని జరిగెను?

కేశ__మనమీఁద కేమి రాదుగద, జనార్దనా!

జనా__మనఃముపోయి పాప మా చంద్రమతి కీ సంగతి నెఱిఁగింతము. మన మిక్కడ నుండి చేయునదే మున్నది? (నిష్క్రమింతురు)

(పిమ్మట చంద్రమతి పిడక లేరుచుఁ బ్రవేశించుచున్నది)

అకటకటా! ఎంత మందభాగ్యురాలను ! నిరంతర మనంతపరిచారికాశతంబుల యూడిగంబు లందికొను పట్టంపురాజ్ఞీపదం బనుభవింపఁ జేసి, దైవమా! తుద కీ నీచ గతి కేల పాల్పఱచితివి? తొలుత నే నన్నిలాటి దాసిగ సృజించిన నీవు నా కెంత యుపకార మొనరించినవాఁడ వగుదువు! ఈ దాసికావృత్తియందైనను నా యజమానురాలిని మెప్పింపలేకుంటి నే? హా! ప్రాణపతీ! హరిశ్చంద్రా! నీ విప్పు డెందున్నావో కదా! ఇట్టియవస్థయం దుండిన నన్నుఁ జూచిన నీ వెంత చింతిలుదువో! ఆనాఁడు కాలకౌశికునికి నన్నొప్పగించునప్పుడు మనసార మన కష్టంబులఁ దలంచుకొనుటకైన వీలులేకపోయినను గడకు మందభాగ్యురాల నగు నేను,

సీ॥ యజమానినైన బ్రా♦హ్మణుని తీవరముచే
నింపార మిముఁ గౌఁగి♦లింపనైతి,
నిబిడాశ్రువులదృష్టి ♦ నిలుపలేకుటచేఁ
గనులార మిముఁ జూచు♦కొనఁగనైతి,
దుఃఖంబు పొంగి కు♦త్తుకబంటి యౌట నో
రార మీతోడ మా♦రాడనైతి,
మసలినన్ వడుగుచే ♦ మాట వచ్చిన టంచు
నొక్కింత మీఁదఁడ ♦ నుండనైతి,
కడకు నన్నొప్పగించి యీ ♦ కర్మమునకు
ముందుఁ బోలేక పోలేక ♦ పోయినాఁడ
వెందు నున్నాఁడ వేగతి ♦ నొందినాఁడ
విలను నున్నాఁడవో లేవొ ♦ యినకులేశ!

అక్కటా! శోకతీవ్రతచే యజమానురాలియాజ్ఞను మఱచుచున్నాను. ఇంకఁ దొందరగాఁ బిడక లేరవలయు. (ఏరుచు) ఓహో! సాయంకాలమై పడమటి కొండయందలి సంజకెంజాయ విశ్వామిత్రుని కోపరసమో యనఁ బ్రకాశించుచున్నది.

మఱియు,

మ॥ కొడుకస్తంగతుఁ డయ్యె నంచుఁ దెలివిన్ ♦ గోల్పోవుచున్ గన్నప్రే
ముడిఁ జింతించెడి లోకబాంధవున కై ♦ పూర్వాశ, ప్రాణేశుఁ డె
య్యెడకో పోయె నటంచుఁ బద్మిని సదా ♦ భృంగీరవవ్యాపృతిన్
దొడఁగెన్ మోము ముడించి యేడ్వ, నట బం♦ధుత్యాగ మింతే కదా!

కాని వడుగులతోఁగలిసి యడవికేగిన మాలోహితాస్యుం డింకను రాకున్నాఁడేమొకో? రావలసిన వేళఁగూడ యతిక్రమించుచున్నది. అదిగో;

శా॥ ఆవు ల్మందలలోన నిల్వక వె యం◆బా యంచు లేదూడలన్
ద్రావింపన్ దమచేపుఁబాలు వడి నిం◆డ్లన్ జేరెడిన్, ముక్కులం
దేవో ధాన్యపుఁగంకు లందికొని య◆ప్డే గూండ్లకున్ జేరె నా
రావంబు ల్చెలఁగన్ బులుంగు, లకటా! ◆ రాఁ డేమి నాపాపఁడే?

నేఁ డేకారణముననో నామనంబు పరిపరివిధంబులఁ దపించుచుఁ గీడునే శంకించుచున్నది. తొలుతఁ గుఱ్ఱవాని స్వామి యడవికిఁ బంపునప్పుడు బాల్యచాపల్యముచే వాఁడు 'నేనడవికిఁబోనే' నన్నమాత్రమున ముక్కోపియైన కాలకౌశికుఁడు చబుకుం బట్టుకొని,

మ॥ "చెడుగా! యేపని చేతగానియెడ నా◆చేనౌనె ముప్పూటలున్
గడుపుబ్బన్ నిను మేప" నంచుఁ దనువున్ ◆ గాయాలుగాఁ గొట్టినన్
బడలే కావ్యథ ప్రాణభీతి "గురుఁ డ◆మ్మా! చూడవే" యంచు నా
కడ కేతెంచిన పుత్రు కష్టగతి నా ◆ గర్భంబు ఛేదించెడిన్.

దైవమా! ఎంతనీచమురవస్థకుం దెచ్చితివి? ఏది యెట్లయినను గుఱ్ఱవాఁ డింకను నాకంటఁ బడలేదుగదా! చెడుదినములుగాన నామనంబు ప్రతిక్షణము శంకించుచునే యున్నది. (ప్రక్కఁజూచి) వారే వడుగులందరు వచ్చుచున్నారు. అక్కటా! కోసినదర్భలు మోయలేక కుఱ్ఱవాఁడు వెనుకంజిక్కె కాఁబోలు! నేను వానికి సహాయము పోయెదను. (ఎదురుబోయి) ఏఁడీ నాలోహితుఁడు? బ్రహ్మచారులు మాత్ర మగపడుచున్నారుగాని నాముద్దులయ్య లోహితుండు కనంబడఁడే?

(వడుగులు ప్రవేశింతురు)

కేశ—జనార్దనా! పాపము, చంద్రమతి యిక్కడనే యున్నదిరా!

జనా—అయ్యో! యీ దారుణవార్త యే మని వచింతుము?

చంద్ర—అన్నలారా! మాలోహితుఁ డెక్కడ?

బ్రహ్మచారులు—(ఊరకుందురు)

చంద్ర—ఏమి నాయనలారా మాటాడరు? మ కేమి యప్రియము లేదుగదా!

కేశ—జనార్దనా! చెప్పుము.

జనా—కేశవా! నీవే చెప్పరా.

చంద్ర—అయ్యలారా! మిమ్ముఁజూచిన నాకడుపు బ్రద్దలగుచున్నది. మీప్రియమిత్రుఁడు లోహితాస్యుఁ డేమయ్యె నయ్యా?

కేశ—అమ్మా! మే మేపాపకర్మ మెఱుఁగము. మేమందఱ మడవిలో దర్భలు కోయు చుండ 'మిత్రులారా! న న్నొక పెనుఁబాము కఱచినది'యను మీలోహితుని దీనా రవము మాకు వినంబడినది. అంత మేము పోయి చూతుముగదా సర్పదష్టుఁడై మరణవేదనఁ బడుచున్నఁ నీ కుమారునిం జూచితిమి.

చంద్రి—హా! తండ్రీ! లోహితా! నే నిప్పుడు చచ్చితినిరా.

(మూర్ఛిల్లును)

కేశ—అమ్మా! ఇంకఁ గొంచెము చెప్పవలసియున్నది.

చంద్రి—నాయనా! ఇం కేమి చెప్పవలయు?

కేశ—అప్పుడు స్పష్టము గాలేని వాక్కులతో నిట్లు చెప్పినాఁడు.

చంద్రి—ఎట్లు, తండ్రీ!

కేశ—(జాగర్యో నను పద్యము చదువును) అట్లు చెప్పునప్పుడు మరణవేదనపడు చుండె. ఇప్పు డెట్లుండెనో తెలియదు. ఎట్లయిన నీకుమారు నొక్కమారు చూచు కొని రమ్ము. ఇదిగో, ఈమార్గమున నూటి గాఁ బోయితివేని నీ కొక వటవృక్షము గాన్పించు. దానినీడయందే నీనందనుండు పడియుండు. మే మిఁకఁ బోయివత్తుము. మా కచట మాటవచ్చును.

చంద్ర—అయ్యలారా! పొండు. నాదురదృష్టమునకు మీ రేమి చేయుదురు?

(బ్రహ్మచారులు నిష్క్రమింతురు)

చంద్రి—హా! కుమారా! లోహితా! నీకు మృత్యుదేవతయై యాకాలసర్ప మెక్కడదాప రించెనోయీ తండ్రీ! అడవి కేగునప్పుడు "అమ్మా! నేను నడువలేనన్నను నన్ను గురుండు బలవంతముగాఁ గొట్టుమఁ బొమ్మనుచున్నాఁ"డని నీ వెంత చెప్పికొన్నను నింటనే నిల్పికొనఁజాలని నేను నిన్నుఁ జూడవచ్చుటకు మాత్ర మెట్లు స్వతంత్రురాల నగుదు? కొడుకా? నీవు నన్నుఁ బూర్ణముగా విడిచిపెట్టితివా? హా! విధీ! పతివియో గముచేతనే యిదివఱకుఁ గృశించి కృశించి యెప్పటి కైన మాహరిశ్చంద్రునిఁ జూడక పోదునా, యెల్లకాలము గష్టము లిట్లేయుండునా యను మొండిధైర్యముచే నెక్కడనో యొక్కప్రాణముతోడ నీలాగు జీవించియున్న నాగర్భమునఁ బుత్ర వియోగాగ్నియుఁ దరికొల్పితివా? నా కింక దిక్కెవ్వరు? హా! ప్రాణేశ్వరా! హరి శ్చంద్రా! నీ విప్పు డెక్కడ నున్నావు? కాలవైపరీత్యముచే నీ కుటుంబమంతయు దిక్కుమాలి నేఁటికి జెట్టున కొకపక్షియై రాలిపోవలసివచ్చెనే! అయ్యో, దుఃఖ భారముచే సేవాకృత్యమును మఱచుచున్నాను. స్వామియాజ్ఞం గైకొని కొడుకు పడియున్న చోటునకైనఁ బోయి జూచివచ్చెదను. అమ్మా! గాలకంటకీ! నీవిప్పు డేమందువో!

కాలకం—[ప్రవేశించి కోపముతో] ఓసీ, అంసనారీ! నీవిల్లుకదలి 'యెంతసేపైనదే? పిడక లేరుకొని రమ్మని పంపఁగా సుఖముగా నిక్కడఁబొద్దులు పుచ్చుచున్నావా?

ఓసీ ! నీకు మా సొమ్మెంతవిషమైనదే? ఈతీరుగాఁ బని కొడలు దాచుకొని యింటి కే ముఖము పెట్టుకొని తిండికి రావలయు ననుకొన్నావు ?

చంద్రి—అమ్మా ! కోపింపకుము. నేను మీ యానల శిరసావహించియే పని చేయుచున్నాను. నేఁడు నాదురదృష్టము పండి దర్భలకై యడవి కేగిన నాకొడుకును బాము కఱచినదఁట.

కాలకం—ఓసీ ! సూత్రధారీ ! తొందరగా నెందుకుఁ బనిచేయవన్నందువ కీ పన్నాగము పన్నినావు. ఛీ ! ఛీ !

చంద్రి—అమ్మా! నే నబద్ధమెన్నఁటికి నాడనమ్మా. దర్భలకై పుట్ట నెక్కఁగా నాకొడుకును బాము పట్టెనఁట.

కాలకం—ఎవరు చెప్పిరి ?

చంద్రి—వెంటబోయిన వడుగులు చెప్పిరి.

కాలకం—అయ్యో! మాకు ధనవ్యయము గలిగింప నీ వెక్కడ దాపరించితివే ! బోలెడు సొమ్మిపోసికొనిన మేము నీజీవమునకుఁ దేవుఁడా యని యేడ్వవలసియుండఁగా నీ కెందులకే యీ యేడుపు ?

చంద్రి—అమ్మా ! కన్న కడుపుగదా !

కాలకం—అట్లయిన నిప్పు డేమి చేయమందువు ?

చంద్రి—కుఱ్ఱవాఁడు పడియున్నచోటి కేఁగి చూచివచ్చెదను. సెలవీయవలయు

కాలకం—ఓసి నిర్భాగ్యురాలా ! ఇంటిలోఁ జేయవలసినపను లెన్నియో ముందుఁ బెట్టుకొని యెక్కడికో పోయెదననుటకు నోరెట్లాడెనే ? నీవు పోయినతరువాత నీపని యంతయు నీతాత ఎవరు చేయును ? ఊరక నోరుమూసికొని నావెంట రమ్ము.

చంద్రి—తల్లీ ! కాలకంటకీ !

మ॥ కడప్రాణంబున నున్నవాఁడొ విసమెక్కెన్ జచ్చెనో కానలోఁ
గొడుకమ్మా! ననుఁ బంపకుండినను యోగ్యుండైన వైద్యుం ద్వరం
బడి యచ్చోటికిఁ బంపుమమ్మ బ్రతికింపన్ జాలునేమో సుతుం
గడకాళ్ళంటి నమస్కరింతు సుతభిక్షం బెట్టి రక్షింపుమా.

కాలకం—చాలుచాలిదివరకుఁ దిన్నదిచాలక మాసొమ్మింకను గుండము వేయుదువుగా! దర్భలకై పోయినవాఁడు పుట్ట లెక్కుట యెందులకు ? పామునోటికిఁ గాలందీయఁగాఁ గఱవక ముద్దుపెట్టుకొనునా ! అట్లు కఱవకుండునట్లు దేశములోని పాములకన్నింటికి వాకట్టు కట్టకుండుట మా దోష తప్పా యేమి? నీకొఱకయి వైద్యు నెవ్వరి నిక్కడ సిద్ధముగా నుంచలేదు. మాకు మందులు చేతఁగావు, మాకులు చేతఁగావు.

ఇంటిలోఁ బనులన్నియుఁ జక్కఁబెట్టి రాత్రి మమ్ము నిదురపుచ్చి నీ వెక్కడికైనఁ బొమ్ము. (పోవుచున్నది)

చంద్ర—అమ్మా! మీ సెలవైనట్లు. (నడచుచు) హా! జీవితేశ్వరా! హరిశ్చంద్రా! నీవు గూడ నావలె సేవానిర్బంధమున లేవుగద! (అని నిష్క్రమించును)

[పిమ్మట నొకకుండ మూఁపుపైఁ బెట్టుకొని హరిశ్చంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

స్వామి యగు వీరబాహుఁడు నన్ను "హరిశ్చంద్రుఁడా! కాదు కాదు. వీరదాసుఁడా! నేఁటిరాత్రియంతయు వల్లకాటియందుఁ గావలియుండి, యుదయమున నింటికి వచ్చునప్పుడీ కుండనిండఁ గ్రొత్తకల్లు నింపుకొని రమ్ము" అని యీ సురాభాండమును నాకిప్పించినాఁడు. ఆహా! సురాభాండమా! నీవు బూజ్యురాలవు. కావున నే విశ్వామిత్రుని సహాయసంపత్తిచే విశ్వవిశ్వంభరాదేవికి నాస్థానం బగు నీ భుజపీఠిపై నిట్లధిష్ఠించియున్నావు. కానీ! నే నిప్పుడు శ్మశానవాటికకే వెళ్ళెదను. అంధకార మప్పుడే బ్రహ్మాండమంతయు నావరించి కన్నులున్నవారిఁగూడ గ్రుడ్డివాండ్రను జేయుచున్నది.

సీ॥ కలవారియిండ్లలో • పలి నిధానము లెత్త
నరుగుదొంగలకు సి • ద్ధాంజనంబు,
మగలఁ గూరుకనిచ్చి • తెగి యంటుగాండ్రకై
తారాడు కులటల • తార్పుఁగత్తె,
అలవోక నలఁతిపి • ట్టలఁ బట్టి వేఁటాడు
పాడుఘూకములకుఁ • బాడిపంట,
మసనంబులోన నిం • పెసలారు శాకినీ
ఢాకినీ తతుల చు • ట్టాల సురభి,
శేలతాంగికి నల్లని • మేలి ముసుఁగు,
కమలజాండంబునకు నెల్ల • గన్నుమూఁతఁ
సత్యవిద్రోహి దుర్యశ • చ్ఛవికిఁ దోడు,
కటికచీఁకటి యలమె ది • క్తటములందు.

ఇఁకఁ ద్వరపడి శ్మశానవాటికకే పోయెదను. (పిమ్మట శ్మశానభూమి కానిపించును.) అహో! ఈశ్మశానంబునం దెచ్చటఁ జూచినను,

సీ॥ కాఁబోలు బ్రహ్మరా • క్షసమూహం బిది
ఘోషించుచుండె బు • క్కలక్రమంబు

కాంచఁబోలు వీరు విగతజీవబాంధవు
లడరుచుండిరి మహోగ్రారవములఁ,
గాంచఁబోలు వీరు టక్కరిభూతమాంత్రికుల్
నెమకుచుండిరి కపాలములకొఱకు,
కాంచఁబోలు నిది పిశాచీబాంధవశ్రేణి
పలలంపు బువ్వంపు బంతి సాగె,
చిట్లుచున్నవి కాంచఁబోలు చితులలోనఁ
గాల్పఁబడెడు శవాలకంకాళసమితి
నెటఁ బెఠీలను రవములే యెసఁగుచుండె
దిక్కుల న్నిండ మాఱ్మ్రోఁత పిక్కటిల్ల.

ఎవ్వ రచ్చట నా కెదురుగా నిలుచున్నారు? పిలిచి చూచెదను. ఓహో! ఎవరు వారు?

గీ॥ కాటిసుంకంబు చెల్లింపకయె శవాల
మసనమునఁ గాల్పరేకద, మనుజులార!
కాపులే దనుకొంటిరేమో పదుండు
దళితఘోరారి యీ వీరదాసు గలఁడు.

(అని నడచి) ఓహో! ఎంత పొరబడితిని? సగము కాలుచు బరువులేక నిట్టనిలువునఁ బైకి లేచిన యీ శవమును ప్రాణిగా భావించితి. అయ్యో! యీ కళేబరపు దుస్థితి యెంత జాలింగొలిపెడిని?

శా॥ మాయామేయజగంబె నిత్యమని సంభావించి మోహంబునన్
నాయిల్లాలని, నాకుమారుడని, ప్రాణం బుండునందాక నెం
తో యల్లాడిన యీశరీర మిపు డిందుం గట్టెలన్ గాలుచో
నా యిల్లాలును రాదు పుత్రుఁడును దోడై రాఁడు తప్పింపఁగన్.

ఇట్టి శ్మశానములం గనినపుడెల్ల నీలాటి వైరాగ్యములు కలుగుచుండుట సహజమే. ఇంక నామంచెదగ్గఱకుఁ బోయెదను. (నడచుచు) అయ్యో! దారి బొత్తుగా నిర్ణయింపలేకున్నాను. ఈ చితిలోని కాష్ఠమును నే నిప్పుడు దీపికగా నుపయోగించుకొనియెద. (అని కొఱవిం గైకొని) ఆహా! చక్రవర్తులకు సేవకాజనముపట్ల బంగారపుఁ గరదీపికలకంటె నాయిప్పటి నీచస్థితికి నీకొఱవియే మిక్కిలి యుచితమైనది.

శా॥ కాలంపుంగతి నెవ్వ డేది యెటు భో।గ్యం బవ్వ డప్పాట నౌ
నాలీలన్ మును నేతుశీతనగమ।ధ్యప్రాజ్యసామ్రాజ్యహే
లాలీలానుగతిన్ జరించి యిపు డీ।లాగైన నా ప్రాప్తికిన్
నాలో నా కొకభంగి నవ్వగు దురం।తంబైన దుఃఖంబుతోన్.

మఱియు,

మ॥ చతురంభోధిపరీతభూవలయర।త్నాదత్తచామీకరా
యతదండంబు ధరించు నీకర మయా।హా! యిప్పు డీక్కాటిలోఁ
జితిలోఁ గాలుచునున్న నీ కొఱవిఁ దా।ల్చెన్ నవ్యమాణిక్యరా
జితనీరాజనకాంతికిన్ బదులువ।చ్చెన్ శోచనీయంబుగన్.

అయ్యో! ఈకొఱవి యప్పుడే యాఱినది! పోనీ! పాఱవైచెదను. (అని మెల్లగా నడచి) ఓహో! ఇదే శ్మశానరాజ్యపట్టాభిషిక్తుఁడ నగు నాసింహాసనము (అని ఎక్కి) నే నిక్కడ సోమఱితనముసఁ గూర్చున్న నిద్దురవచ్చి స్వామికార్యంబునకు భంగము కలుగును గదా! అయ్యో! నాకును నిద్రాహారములకును ఋణము దీఱి యెంత కాలమైనది? సుగుణవతియు నాయర్ధాంగలక్ష్మియు నగు చంద్రమతిం గొడుకుతో నొక్కనికి దాసిగా నెవ్వ డమ్మికొంటినో నాఁటితో నాకును నా సౌఖ్యమునకును ఋణము దీఱినది. మొండివడి ప్రాణముమాత్రము వెడలిపోకున్నది. ప్రాణము పోయిన నీదుఃఖములన్నియు నెవ్వ రనుభవించువారు? ఆహా! దైవోపహతుఁడనై నే నిప్పు డెన్ని విధములఁ బాధింపఁబడుచున్నాను.

మ॥ అకటా! యొక్కని పంచదాసియయి య।ట్లల్లాడు నిల్లాలిపా
ట్లకునై కుందుదునా? సువర్ణమయుడో।లాకేళికిం బాసి పా
ట్లకునై రోసి తపించు నాకొడుకుబా।డుం గాంచి దుఃఖింతునా?
యిఁక నీ నీచఁపుఁగాటికాపరిని నా।కే నేను శోకింతునా?

హా!హా! లోకములోని కష్టంబులన్నియు నన్నే కోరి వరించినట్లున్నది. కాకున్న నిన్నికష్టము లెవ్వరనుభవింతురు? అయ్యో! ఈ నిర్భాగ్యపు హరిశ్చంద్రుండు గతించిన వెనుక మఱల నీకష్టంబులకుఁ దావెక్కడ దొరకునో! రాజ్యవియోగంబునకై దుఃఖింపను; మహారణ్యవాసాదిఘోరదుఃఖంబు లెన్ని సంభవించినను గణింపను; కడ కతినీచతమం బగు నా యీ చండాలదాస్యంబునకుంగూడఁ బరితపింపను; కాని చేపట్టి నదాది నన్నే పరమదైవంబుగ భావించుచు నామూలమునఁ దన కంతలేని కష్టములు

సంభవించినను క్షమాగుణసంపత్తిచే సహించుటేకాక తన్ను నొక్కనికిఁ దెగనమ్మి కొనుట నీచంబని నే సంకోచించినప్పుడు 'నాథా! సత్యప్రతిష్ఠకై యొనరించు నీచకృత్యంబులును సగౌరవంబులే యగు' అని నాకు నుత్సాహము కలిగించి నా సత్యదీక్షం గాపాడిన నాయర్ధాంగలక్ష్మి యగు చంద్రమతీదేవి వియోగదుఃఖము నే నేగతి భరింతు? హా! దేవీ! అసూర్యంపశ్యా! నీరాణివాససౌఖ్యం బేమయ్యెను! అయ్యో! సాధ్వీమణీ! నీపతి బ్రతికియుండగనే నీ వనాథవై యొక్కనిదయకుఁ బాత్రురాలవు గావలసి వచ్చెఁగదా! హా! కుమారా! లోహితా! నిన్ను మఱల నే నెన్నఁడు జూడగలుగుదు? తండ్రీ! దాసదాసీజనంబుల చేతులనుండి యడుగటువెట్టనీక మిగుల గారాబమునఁ బెంచిన నిన్నట్టి నిష్ఠురతమంబగు దాస్యంబున కొప్పగించితిఁగదా! అక్కటా! నాదుఃఖ మంతకంతకు మితిమీఱుచున్నది. కడచిన విపత్తు లొక్కటొక్కటిగఁ దలంపునకు వచ్చి నాధైర్యమును మఱింతమాపుచున్నవి. ఆహా! ఆనాఁడు నాభార్యాపుత్రులఁ గాలకౌశికునకు విక్రయించునప్పుడు "దాసీ! కదల వేమి" అని యప్పాఱుండు తనతల్లి నదలించినాఁ డని మాలోహితుండు 'ఓరీ మాయమ్మ నెక్కడకుఁ గొంపోయెదవురా!' యని తనపై నడరినాఁ డని యాకాలకౌశికుఁడు నిర్దయుఁడై,

మ॥ "కుడువం గూటికి లేకపోయినను నీ•కుం గా రాజసం బెంత హె
చ్చెదురా ఛీ! తలకెక్కెనే పొగరు దా•సీపుత్ర!" యంచుం సుతు
న్బడద్రోయుం గొడుకట్టె నావదనము • న్గన్నీళ్లతోఁ జూచె హా!
కడుపుం ఱంపపుఁగోతగోయు నదియే • గాయంబు గాకుండగన్.

అయ్యో! అట్టి దురవస్థనుండి సతీసుతులం దప్పింపలేకపోయితిఁగదా! నాకైగదా రారాజు బిడ్డయగు నిల్లాలు దిక్కుమాలి పరులకొంపలఁ జాకిరికత్తెయై యల్లాడుట? ఛీ! ఛీ! కఠినకర్మా! హరిశ్చంద్రా! నీజన్మము నిజముగా నిరర్థకమైనది' మాడు,

సీ॥ విడలేక నీ వెను•వెంట వచ్చెదమన్న
పౌరులదుఃఖము • ల్బాపినావో,
సరిరాచబిడ్డయౌ • సతిని నిల్లాలినిఁ
బ్రియ మారఁగా సుఖ•పెట్టినావో,
కడుపారఁగన్న యా • కొడుకును ముద్దుగాఁ
బెంచి ముచ్చటలఁ జె•ల్లించినావో,
పుత్రవత్సలత నె•ప్పుడు నిన్నుఁ బ్రేమించు
కులగురు నాజ్ఞలో • మెలఁగినావో,

గీ॥ రవిమొదలుకొని నీదాఁకఁ • బ్రబలుచుండు
స్వకులగౌరవములను గా•పాడినావొ,
చావ కెందుకు ఛీ! హరి•శ్చంద్ర! నీవు
బ్రతికియున్నావు జీవచ్ఛ•వంబ వగుచు?

అయ్యో! ఎంతవైపరీత్యము జరిగెను! ఎప్పటికైన శుభదినములు రాకపోవునా యను ధైర్యముగూడ నంతరించినది. బ్రతికియున్నంతవరకు దేవి కా దాస్యదుఃఖంబును, నా కీ కాటికాపరి యుద్యోగమును నవశ్యానుభోక్తవ్యంబులే కదా!

శా॥ "నాదాసీత్వముఁ బాపి యెప్పటికినై •నన్ జింత లీడేర్పఁడే
నాదేవుం" డను నాసతో నసువుల • న్భారంబుగా. మోసి నే
నే దిక్కాఁదని నమ్మియుండు సతి నా•హీనస్థితిన్ గానమిన్
యీ దౌర్భాగ్యపుఁ గాటికాపరితనం • బేపాటి తన్ బ్రోచెడిన్.

అకటకటా! మందభాగ్యుఁడనైన నాచిత్తమునకు శాంతి యెప్పటికో! అయ్యో! ఇంక శాంతి గా కే మున్నది?

శా॥ నానాఁటన్ బరిపాటి నామది దురం•తంబైన చింతాహతిన్
మానై రాయయి వజ్రమై స్వగుణధ•ర్మంబైన చైతన్యలీ
లానైజంబు ద్యజించి నిర్వికృతి మే•ళ్ళన్ గీళ్ళ నొక్కమ్మడిన్
బూనన్ యోగిమనంబురీతి యపుడే • హో శాంతి నాచింతకున్.

కావున నింక దుఃఖించినమాత్రి మేమి ప్రయోజనము? సత్యస్థైర్యుఁడనైన నే నింక ధైర్యమునే వహింపవలయు. అయ్యో! ఏ మిది? దుఃఖప్రాబల్యమునఁ గర్తవ్యంబు మఱచితిని. [శృతి నభినయించి] ఎక్కడనుండియో దీనారవంబు శ్రవణగోచరమగుచున్నది. పోయి చూఁచెదఁ గాక!

(పిమ్మట నొక మూలనుండి చంద్రమతి ప్రవేశించు చున్నది)

చంద్ర—అయ్యో! ఈ యర్ధరాత్రిమున నాకుమారుని జాడ నెవ్వరి నడుగుదును? దిక్కులేని నాకుఁ బ్రకృతియే తోడు గావలయు.

సీ॥ జలదమా! సుంత మా•ఱ్పులికిన దోసమా
యెఱుఁగవా నీవు లో•హితునిజాడ,
పరుగెత్తకుము చక్ర•వాకి! యేకడనైనఁ
గనుఁగొంటివమ్మ నా • కన్నవానిఁ,

గానంత మెఱపించి ♦ మోసగించెదవేల
తోడురావమ్మ వి♦ద్యుల్లతాంగి!
జలదంపుఁ దెరఁ బాసి ♦ వెలికి రం డొక్కింత
తారలారా! నా కు♦మారుఁ జూప,
కానవా వాని గంగాభ♦వాని! సుంత
గోల చాలించి వినుము నా ♦ గోడు కొంత,
వేగ గాన్పింపుమయ్య యో ♦ విశ్వనాథ!
నీకుమారునిఁ బోలిన ♦ నా కుమారు.

అయ్యో! గతిచాలనివేళ నామాట నెవ్వరు పాటింతురు? హా! సుతా! లోహితా! నీ వెక్కడనున్నావు తండ్రీ! మునికులపవిత్రా! గాధిపుత్రా! మ మ్మెంతయైన సాధింపుము. ఒక్కమాఱు నాకుమారుం జూచుకొననిమ్ము. (నడచుచు) ఏ మది? కాలికి నేదియో మెత్తని వస్తువు తగిలినది. నాకుమారుని శరీరము కాదుకదా? (పరికించి) హా! లోహితాస్యా! నీ కింతటి యవస్థ సంభవించెనురా కొడుకా! పలుక వేమి? అయ్యో! ఇచ్చటి కంటకములచేత నిదివరకే నొత్తుకొనుచున్న నీ మృదుశరీరము కఠినం బగు నాపాదతాడనముచేత నిం కెంత బాధపడుచుండెనో! తనయా! పుట్టినదాది యే కష్టము నెఱుంగని నిన్ను గురుం డడవికిఁ బంపుమండఁగా నూరకుంటినని నాపై నలిగితివా? లేకున్న, నాతోడ నీవేల మాటాడవు? నాయనా! శరత్కాలపూర్ణిమా రాకానిశాకరబింబంబుడంబు విడంబించు నీముద్దుమోము చిఱునవ్వు వెన్నెలలచే నలరారుమండఁ గనులారఁ జూడకున్నను నమృతరసంబునకేని లభింపరాని మాధుర్యంబు జిలుకు నీముద్దుపలుకులు చెవులారవినకున్నను నాబ్రదుకింకేమి యున్నది? తండ్రీ! నే నిం కెవ్వరినిఁ జూచి పుడమిపై జీవించియుందు? నాకిం కెవ్వరు దిక్కు? రాజ్యసుఖాద్యుత్తమభోగంబులనుఁ బాసి చేసికొనినపతికి దూరస్థురాలనై యొక్కనియింట నూడిగంపుఁగత్తెనై కాలముఁ గడపు నీచస్థితికి వచ్చినను గడుపునఁ బుట్టినకుమారుఁడవు సకలలక్షణలక్షితాకారుఁడవు, వంశైకశాస్త్రాయుండవు, నీ వొక్కఁడవు గట్టిగానున్నాఁడవంతియే చాలునని ప్రాణములన్నియు నీమీఁద నే నెలకొల్పి బ్రతుకుచున్న న న్నిప్పుడే సముద్రమునఁ ద్రోసిపోయెదవు? తండ్రీ! దాసదాసీజనము లూఁచు బంగారు తూఁగుటుయ్యేలలపై సుఖనిద్రఁ జెందు సౌఖ్య మప్పుడే యంతరించినను నీకు నా కాలకౌశికునియింటఁ బండుకొనుటకు నాపైఁటకొంగైన నింతయాధారము దొరకుచుండెనే. నే డేదియులేక దట్టముగా ముండులచే నిండియుండిన యీ నట్టడవిలో నీయర్ధరాత్రమున నిట్లొంటిగ నిద్రించుచుంటి వేమోయీ! కొడుకా! లోహితా! నీకు నేఁటి

కీ గులకతాల నేలరయే పూలపాన్పయ్యెనా ! అయ్యో! క్రూరసర్పమా ! నిన్నే మందును? నిష్కారణముగ నా కుమారు నేల కఱచితివి ? ఛీ ! సర్పాధమా !

మ॥ పని యేమున్నది నిన్ననక్ నడకలా ♦ వక్రంబు, లేప్రొద్దు నీ
పనియే ఘోరవిషంబు గ్రక్కుట; జగ♦త్ప్రాణాశనోద్వృత్తి పె
ట్టినపేరే; యదిగాక నాలుకలు రెం♦టిం దాల్చినా విట్టి నీ
కనుకంపాగుణ ముందు మన్న నేటు సా♦ధ్యంబౌను దర్వీకరా.!

అయ్యో, శోకాతిరేకముచే నీపాదమును దూషించుచున్నానేమి? ఇప్పటికి రాత్రిలో మూఁడవజాము జరుగుచున్నట్లున్నది. తెల్లవారకమును పేఁగంటికి గనంబడకున్న దొరసాని యూరకుండదు. కొడుకా ! యిఁక నీ నవమన్మథాకారమును జూతమనుకొన్నను సంభవింపదే యని యిప్పుడే తనివితీరఁ జూచుకొనుచు నీ శవముకడఁ దడవునిల్చుటకైన నే నిప్పుడు స్వతంత్రురాలను గాకుంటినే! నాయనా! రమ్ము. లోకాచారముల ననుసరించి నిన్ను చేతులారఁ గాటికప్పగించి చేతులుగడుగుకొనియెదను. [ఎత్తుకొని] అయ్యో ! యిప్పుడు శ్మశానవాటికకు నేదారి యని పోయెదను? పుత్రశోకంబున నావరింపఁబడిన నా హృదయమువలెనె యీ బ్రహ్మాండమంతయు నంధకారబంధురంబై యున్నది. లోహితాస్యుఁడను నా బాలసూర్యుఁ డస్తమించినవెనుక లోకమున నంధకారముగాక నింకేమున్నది? [నడచుచు] ఆవంక యేదియో వెలుతురు గానవచ్చుచున్నది. నరసంచారంబులేని యీకాంతారంబున నీవెలుతు రెచ్చోటిదో! అయ్యో, నా కాళ్ళు గడగడ వడకుచున్నవి. ఏబాడవిన్నను మాఁగిసియులికిడి లేకపోయినను దిక్కులన్నియు బ్రక్కలగునట్లు పిక్కటిలుచున్న గంగానదీఘోషంబును నీ నట్టడవియందలి ఝిల్లీనినదంబును నాగుండెలు బ్రద్దలుచేయుచున్నవి. [నడచుచు] ఆవెలుతురున్నచోటే శ్మశానము కాఁబోలు! అప్రక్కకే నడిచెదను. అహో ! యిదే శ్మశానవాటిక. అయ్యో! నే నెంత సాహసముచేసి యిచ్చటికి వచ్చితిని! ప్రాణంబులకు రోసిన నాకు సాహసంబుగాక యింకేమున్నది? కులవర్ధనుండగు నీలాటికొడుకిట్లు కాటిపాలై పోయినవెనుక నే నిఁకను బ్రతికి యేమి ప్రయోజనము? తనయా! నీవిచ్చటఁబండుకొనుము. నీదహనకార్యమునకై నిన్నిచితులైనఁ బోగుచేసెదను. [అట్లుచేయుచు] హా! ప్రాణపతీ ! హరిశ్చంద్రా ! యిట్టికష్టకాలమునఁగూడ నీవు దగ్గఱ లేకుంటివే.

[ప్రవేశము హరిశ్చంద్రుఁడు]

గీ॥ హృదయమున దుఃఖ మింతేనిఁ ♦ బదిలపడదు
మఱతునన్న సతీసుతు ♦ ల్మఱపురారు

కంటి కిది యేమొ! పలుమారు • కానిపించు
నెక్కడో నున్న నాదు లో • హితుఁడు నేఁడు.

చంద్ర__హా! సుతా నన్ను వదలి పోయితివా?

హరి__ఆహా! యెక్కడిది యీ దీనారవంబు? ఇది పరికింపఁగా సతీకంఠస్వరంబుగా నున్నది కాని పురుషునిది కాదు. పాప మా మందభాగ్యు రా లెవరో పోయి చూచుట మేలు [నడచుచున్నాడు]

చంద్ర__హా! కుమారా! నాకు నేటితో సర్వాశాపరిపూర్తియయ్యెఁగా! తండ్రీ! నీదహన కార్యంబునకుఁ దుదకుఁగట్టెలకు గూడ గతిమాలి నీతల్లి యల్లాడవలసి వచ్చెనే! [శవము నెత్తుకొని] హా! పుత్రా! నీకు నే నెంత ఘోరముఁ జేయ సాహసించితి!

మ॥ చనుబాలిచ్చినతోడనే నిదురబు • చ్చన్ బొత్తులం దుంచి య
ల్లన జోకొట్టుచు నొక్క కేలఁ, బెఱకే • లన్ డోలికంబట్టి యూఁ
చిన నీతల్లియె యిప్పుడీ చితిపయిన్ • జేసెత నిన్ జేర్చి, హా!
యనిదుఃఖించెడుదిక్కుమాలి, కొడుకా! • యన్యాయమిం కేమనన్.

నాయనా! రాజాధిరాజకుమారుఁడవైన నీకుఁ గాలవశమునఁ గష్టములు వచ్చినను జనిపోయిన వెనుకనైనను నీదహనవిధి యథావిధిజరుగక యీవల్లకాటియం దెవ్వనిదో యొకనిచితిలో సగముకాలిన యల్పకాష్ఠములు నీ కాధారములయ్యెగదా! నవమాసంబులు మోసి, కని, ముద్దుముచ్చటలం బెంచిన నీ కన్నతల్లియా నీకుఁ గడకుఁ దలకొఱవి నిడుట? ఛీ! ఛీ! చంద్రమతీ! నీ వెంత రాకాసివి! ఈ దుఃఖమున నీ పతికిం బాలీయక నీవొక్కతె వి ట్లనుభవించుటకు నీ జన్మ మెంత దౌర్భాగ్యపు జన్మము! [కొఱవిం జితి నంటించుచున్నది.]

హరి__(సమీపించి) ఓహో! నాయాజ్ఞ లేకుండ నిక్కడఁ జితిఁగూడఁ బేర్చినదే! ఓహో! ఎవ్వతె వీవు?

స్రగ్ధర

పడతీ! యేకాకివై ని • ర్భయమున నిటకున్ • వచ్చి నాయాజ్ఞ లేకీ
నడురేయిన్ వల్లకాట • న్నవదహనవిధి • న్సలుపుచున్నావుగా! ఛీ
చెడుగా! చాల్చాలు పోపో • చెడెదవు తగునే • చేడె కీకృత్యముల్? నా
కడ నా నీముచ్చువేసా • ల్కడలుకదలుమా • కాడు నీయబ్బసొమ్మా!

(అని చితిం గూలఁదన్నుచున్నాఁడు)

చంద్ర—అయ్యో! ఇప్పుడుగూడ నెంత పరాభవము జరుగుచున్నది? హా! ప్రాణపతీ యిట్టి యవస్థయందు నీవు నాకు సహాయపడుటకు నాయండ నుండవైతివే!

హరి—[స్వగతము] యేమి? యీమె పతివిదూరయా? ఎవ్వతెయో, కాని,

గీ॥ ఈనెలంత సుశీలగాఁ ♦ గానుపించుఁ
గారణాంతరమున నిట్టి♦కష్టదశను
జెందినట్లున్న దదిగాక ♦ ముందు నేను
విన్నదియు గానె యున్న దీ ♦ వెలఁది స్వరము.

అయినను విచారించినఁ దప్పేమి? [ప్రకాశముగా]

మ॥ పడఁతీ! యెవ్వతె వీవు? ఆలుగరఁగన్ ♦ వాపోవుచున్నావు, నీ
కొడుకెద్దాన గతించె? నెవ్వరును నీ♦కుం జుట్టము ల్లేరె? యీ
నడిరే నొంటిగ నెట్లు వచ్చితి శ్మశా♦నక్షోణికిన్ జిత్రమ
య్యెడు నీరీతి వచింపు, మేడ్చి ఫల మే♦మీ? యీఅటంబొందుమీ.

చంద్ర—[స్వగతము]

గీ॥ అరయ నితఁ డొక మహనీయుఁ♦డట్లు దోఁచు
నీతని వచోవిధం బెన్న ♦ నేమొ కాని
పరిపరివిధంబులను బాఱు ♦ హృదయవృత్తి
యింత దుఃఖంబునను గొంత♦శాంతి వొడమ.

ఏమైనను నిప్పుడు మౌనము వహించినఁ గార్యము నెఱవేఱదు కాని నిట్లు మాట్లాడెదను.

చ॥ పురుషవరేణ్య! నీ వెవఁడ♦వో యెఱుఁగన్ మననంబులో పలన్
దిరిగెడు భూతనాథుఁడవో ♦ దీనదశాకలనన్ గృశించు నన్
గరుణ ననుగ్రహించుటకుఁ♦గాఁ జనుదెంచిన సిద్ధమూర్తివో
పరమదయాబ్ధి! నే నవనిపైఁ ♦ గొరగాని యభాగ్యదేవతన్.

హరి—మానినీ! నే సిద్ధుండ గాను, భూతేశుండ గాను. ఈ వల్లకాటిం గావలి గాయుఁవాడఁను. కాని సాహసము చేసి యీయర్ధరాత్రిమునఁ దోడులేక యిక్కాటి కెట్లు వచ్చితివి? నీచరిత్ర మేమో యెఱిఁగింపుము. వచ్చిన కష్టము లనుభవింపక తీఱదుగదా!

చంద్ర—మ॥ అనఘా! యెంతని విన్నవింపఁగలన♦య్యా! రోళ్లరోకళ్ళఁ బా
డిన నా దీనచరిత్ర మెల్ల, నొకపా♦డిన్ జేసి యీ దేహ మెు

క్కని సొత్తౌటఁ దలంచి ప్రాణముల బిగ్గంబట్టుటే కాక యే
మని జీవింతును దిక్కుమాలి కడు హేయంబైన దాస్యంబునన్.

పూజ్యుఁడా! యిట్టి దీనురాలికి నిప్పు డెవ్వరు తోడురాగలరు చూడు,

సీ॥ కొడుకా! యటంచు నాపడు నవస్థకు జాలిఁ
గొని యేడ్చు నల దిశాంగనలె తోడు
తన జంటబాసి మింటను "కువ్వాకువ్వు" యంచు
శోకించు నలచక్రవాకితోడు
నను నూఱడింప హారని యేడ్చు లోకపా
వని యగు గంగాభవానితోడు
ననుఁ జూచి బొటబొట నును మంచు కన్నీళ్ళు
లం గార్చుతీవె యిల్లాంద్రు తోడు
ఆపదలకైనవారి నా యన్నవారి
దిక్కులేనట్టి నావంటి దీనతతికి
కాశికావిశ్వనాథుఁడే కలఁడు తోడు
కడమ తోడేడ నాకు నో కాటిఱేఁడ!

మహానుభావుఁడా! నీవు నాకుఁ గడుఁ బూజ్యుండవుగాఁ దోచుచున్నాఁడవు. నే నీ కాశీపురంబున నొక బ్రాహ్మణుని యింట దాసిని. నాపే రంసనారి యందురు. ఈ చనిపోయినవాఁడు మదేకపుత్రుండు. వీని నేఁటి సాయంసమయమున,

చ॥ అడవికిఁబోయి కట్టెలఁ గుశాదులఁ దెమ్మను ఱేనియాన ని
య్యెడ కరుదేర నాదు దురదృష్టముచేఁ బెనుబాముచేత నీ
కొడుకున కీ నవాంగజునకుం మరణంబు ఘటిల్లెనయ్యా, నా
పడు దురవస్థ యేమనుచుఁ బల్కుదు దుఃఖము పొంగిపొర్లెడున్.

హరి.—(స్వగతము) యేమిది! ఈ మానినిం జూచినప్పటినుండియు నా హృదయ మకారణముగా దుఃఖసంకులం బగుటయే గాక, విశేషించి

ఉ॥ ఈయలివేణి నోట వచియించెడు నొక్కొకమాట యొక్క వ
జ్రాయుధమై పెకల్చెడు శిలాకృతిఁ గాంచిన నాదు మానసం

బీయము మాటపొందికయు ♦ నెల్లుదెలుంగు నుదంతమెల్ల ని
సీ! యనరాదుగాని స్పృహి♦యించును చంద్రమతీసతీమణిన్.

అదిగాక యిక్కాంత కష్టోదంతంబెల్ల మంద భాగ్యుండ నైన నాకే తగిలివచ్చుచున్నది. చనిపోయిన యీకుఱ్ఱఁడు మాలోహితుండు కాడుగదా! ఛీ! ఛీ! నాపాడు తలంపున కెట్టి దురూహ పొడమినది! కొడుకా! లోహితా! నీ కమంగళము ప్రతిహతమగుఁగాక! ఇఁక నా వెఱఁగుదలంపుల మానివేసి నావిధియందు నే నప్రమత్తుఁడనై మెలంగెద. (ప్రకాశముగా) ఓ మానినీ! నీ వెవ్వతెవైన మాకేమిగాని నా యాజ్ఞలేకుండ నిక్కాటికీ శవ మేల తీసికొని వచ్చితివి? ముందు చెప్పుము.

చంద్ర—పూజ్యుఁడా! శవదహనమునకుఁ గూడ నొకరి యాజ్ఞ కావలయునా?

హరి—ఏమీ బొత్తుగా యిచ్చటి గాటిచట్టముల గుర్తెఱుంగకున్నావే! ఎవ్వరుగాని దహింప వలసిన శవమును దెచ్చి ముందు మాకుఁ జూపి, చెల్లించవలసిన సుంకమును చెల్లించినగాని దహనకార్యం బుపక్రమింపరు. నీవు బలు తెగువదారివిలాగున్నావుగాని,

చ॥ పదపద యిప్పుడైన తెఱ♦వా! తడవయ్యెను మాకు నేల ని
ల్చెద విఁక నీ కుమారుని క♦ళేబర మావలఁ బాఱవైచు నం
తదనుకఁ బోవె? శూలినయి♦నన్ దలగోయక యూరకుందునా
ముదితవు గాననే బ్రతికి♦పోయితి వింకఁ దొలంగు మిచ్చటన్.

చంద్ర—ఓ దయామయా! యెఱుఁగక జేసిన నా నేరమును మన్నింపుము. నే నిప్పుడు శరీరమాత్రవిభవనై యున్నాను. విప్రు నింట నూడిగము చేసికొనిగాని గ్రాసవాసంబులు జరుగని నిరుపేదరాలను. నే నేమూలమునఁ గాటిసుంకమును జెల్లింపగలను?

హరి—(స్వగతము) అక్కటా! నే నెంత గాఠిన్యము వహింపవలసివచ్చెను. (ప్రకాశముగా) మానినీ! నీవు పేదరాలవైన మాకేమి! భాగ్యవంతురాలవైన మాకేమి! భాగ్యమున్నను మాకు రావలసిన సుంకము కంటె నెక్కుడు మే మపేక్షింపము. మాడ యొకటియు పిండంబుఁ దండులంబులును, నొక పాతయు, మాకిచ్చినం గాని నే నీ శవమును దహింపనీయను. నన్ను గఠినాత్ముం డని యెంచినను సరే. కులధర్మంబుల వీటంబుచ్చి యీరీతిం గాటికాపరితనముచే జీవించు యీచండాల దాసునకుం గరుణ యెక్కడిది? పొమ్ము.

చంద్ర—అయ్యో! ఎవరైన నేమి? దీనరక్షణము తప్పుగాదుకదా!

హరి—తప్పో యొప్పో మాకడం జెప్పకుము. పొమ్ము. శవమును బాఱవైచెదఁ జూడుము.
[యని పాఱవైవఁ బోవును]

చంద్ర—అకటకటా! ఎంతటి కానికాలము సంభవించినది. విశ్వవిశ్వంభరాచక్రంబున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యము వహించి యశ్రాంతంబు పాదాక్రాంతు లైన సామంత భూకాంతులకోటీరమణిఘృణినీరాజనంబులచే విరాజిల్లు పాదయుగళముగల చక్రవర్తికిఁ గుమారుఁడై కడకీ కాటిలోఁ జేరెడు నేలకేని స్వతంత్రుఁడగుటకు నోచుకొనక పోయెనుగా? కొడుకా! నీప్రారబ్ధంబున కెంతని విలపింతు?

హరి—(స్వగతము) ఈబాలుం డెవ్వడో మహారాజకుమారుం డని విస్పష్టమైనదే. నే నింక నేమని తలంపను? వీఁడు నిశ్చయముగా మాలోహితాస్యుఁడే యేమో? నిస్సంశయముగాఁ బేరు తెలియకయే నేనేల కీడునే యూహింపవలయు? తండ్రీ! లోహితాస్యా! నీకు దీర్ఘాయురారోగ్యములు గలుగుఁ గాక! వీఁ డెవ్వఁడైన నేమి? నావిధి యందు మఱియొకవిధముగాఁ బ్రవర్తింపరాదుకదా! (ప్రకాశముగా) ఓకాంతా! నీ వెంత యేడ్చినను నేను గరుణింపఁజాలను. నీయుదంతం బంతయుఁ గడు నద్భుతముగా నున్నది. చనిపోయిన వీఁడు రాజకుమారుఁడైనట్లు నీయేడుపువలన దెలియవచ్చినది. నిజముగా నీవు రాచదేవేరివేయైనచో మాకీయవలసిన కాటిసుంకము నీకడ లేకుండునా?

చంద్ర—అయ్యో! కాలవైపరీత్యమున నుత్తమపదవిం బాసి యిప్పుడు నేను శరీరమాత్రవిభవనై యున్నానని యిదివఱకే విన్నవించుకొంటినే? నీకేల దయరాదు?

హరి—నే నిది బొత్తుగా నమ్మను. నీ కిప్పుడున్నవిభవము శరీరమాత్రమే కాదు. ఆలోచించుకొనుము.

చంద్ర—అయ్యో! ఇం కేమున్నది?

హరి—ఏమీ యింకేమి లేదా? చూడు,

మ॥ దళమా పయ్యెదలో నడంగియు సముద్యత్కాంతు లీరెండలన్
మలయింపన్ దిశలన్ ద్వదీయగళసీమన్ బాలసూర్యప్రభా
కలితంబై వెలుఁగొందుచున్న దది మాంగల్యంబు కాఁబోలు! నే
వెలకైనన్ దెగనమ్మి నీసుతునికై వెచ్చించినన్ జెల్లదే?

చంద్ర—(ఉలికిపడి) అయ్యో! దైవమా! రెండవసురజ్యేష్ఠుఁడగు వసిష్ఠమహర్షి ప్రభావంబుచే నాపతికిం దక్క నన్యులకు గోచరంబుగాని నామంగళసూత్ర మొక్క చండాలుని కంటంబడెఁగా! కాదుకా దితఁడు నాపతి హరిశ్చంద్రుఁడే (అని కౌఁగిలించుకొని) హా! జీవితేశ్వరా! హా! విశ్వవిశ్వంభరాఖండరాజ్యప్రదానసంతర్పితకౌశికా! హా! వసిష్ఠప్రియశిష్యా! హా! సార్వభౌమలలామ! హా! సత్యప్రియా! హా! హరిశ్చంద్రా! నేనే మందభాగ్యురాల నగు నీజీవితేశ్వరిని చంద్రమతిని. ఎల్లప్పు డల్లారుముద్దులఁ బెంచిన నీవంశాంకురంబగు నీకుమారుఁడు లోహితాస్యుఁడీకాటిలో గులకటాలకై నెట్లు పండుకొనియున్నాఁడో యొక్కమాఱు గన్నెత్తి చూడుము. ప్రాణపతీ! రాజరాజకోటీరమణిమంజరీపింజరితపాదాంభోజుఁడ వగు నీకా, యీకాటికావలితన

ము? అకటకటా! దుర్గవలోక్యం బగు నీ ప్రేతాలయంబే నీకయోధ్యాపురంబయ్యెనే? కళులుఁగలిగిన నులకత్రాళ్ళచే నల్లఁబడిన యీమంచెయే నీకు నవరత్నసింహాసనం బయ్యెనా? భయంకరంబులగు నీభూతభేతాళపిశాచగణంబులా నీకు భటసముదాయము? శవనికరంబుల దహించుచుండిన సొదగుంపా నీకుఁ గరదీపికాసహస్రములు? నాథా! నీరాజసం బెందుపోయినది? నీతేజం బెందుదాగినది? జీవితేశ్వరా! అశ్రాంతంబు పాదాక్రాంతులై నమస్కరించు సామంతులెల్ల నీకిప్పుడేల యడుగునకు మడుఁగులొత్తకుండిరి? కరపల్లవంబుల బంగారుపళ్ళెరంబులఁబట్టి పురంధ్రీజనంబు నీ కేల నీరాజనంబుల నెత్తకుండె? నీసత్యభాషామనీషం గురించి ప్రబంధంబుల నుడువు వందిమాగధజనం బెందు బోయె? రాజచూడామణీ!

సీ॥ పసిడిమేడలలోన • వసియించు ప్రభునకా
కటకటా! యీ వల్లకాటి వసతి?
కనుసన్న దొరలచేఁ • బను లందికొను మీక
యీ నికృష్టఁపుమాలవాని సేవ
అలరుఁ దేలియలతో • లారగించెడు మీక
అకట! శవాలపిండాశనంబు
జిలుగుబంగారుదు • స్తుల ధరించెడు మీక
పొలసుకంపొలయు నీ • బొంతకోక
కనుల మీయిట్టి దుస్థితిం • గనిన నాకుఁ
జావురాకున్న దెంతని • సంతసింతు
హా! హరిశ్చంద్ర! సారవి • ద్యాఫణీంద్ర!
బుధజనమనశ్చకోర సం • పూర్ణచంద్ర!

ప్రాణేశ్వరా! మన విపత్పరంపర కేనాటి కంతము లేకపోయెనే? నన్ను విక్రయించుటచే విశ్వామిత్రుని ఋణబాధ నిరవశేషముగాఁ దొలంగి యెక్కడనో మీరు కొంత సుఖముగా నున్నారని తలంచితిఁగాని నాకు సంభవించిన దాస్యమునకంటె వేయిమడుంగు లెక్కుడు నీచంబగు నీ చండాల సేవావృత్తియందుఁ జిక్కియున్న మీకడకుఁ జనిపోయిన మనలోహితాస్యుని కళేబరముతో నిట్లువచ్చెద నని యెక్కనాఁడు దలంపనైతినే? నృపసార్వభౌమా! ధైర్యమువహించి యెక్కమాకైన నాడుము.

హరి___ఏమీ! నీవు చంద్రమతివేనా? అయ్యో! వీఁడు నాకొడుకు లోహితాస్యుఁడా?
(కుమారు నెత్తుకొని)

శా॥ హా! సూర్యాన్వయవార్ధికౌస్తుభమణీ! హా! సద్గుణాంభోనిధీ!
హా! సౌందర్యనిరస్తమన్మథకళా! హా! పూర్ణచంద్రాననా!
హా! సల్లక్షణలక్షితాంగలలితా! హా! మత్తభృంగాలకా!
హా! సేవాపరితోషితద్విజమణీ! హా! లోహితా! హా! సుతా!

తండ్రీ! పలుకవేమి? నిన్ను దుస్సహంబగు సేవకావృత్తికి నప్పగించిన కిరాతుండైన నిన్ను గన్నతండ్రిని నన్నొక్కమాఱు తెప్పలెత్తి చూడనైనఁ జూడుము. నాయనా! నీ వప్పుడే స్వర్గయాత్రం బట్టుటకు నీకేమి నూఱేండ్లునిండినవి? కొడుకా! లోహితా!

సీ॥ మోయలే దింకను మూఁపు కాయలుగాయ
సర్వసర్వంసహాచక్రతలము
వ్రాయలే దింక గర్వాయత్తుల జయించి
యఖిలదిక్కుల విజయాక్షరముల
నిలుపలే దింక సత్కులకాంతను వరించి
సింహాసనమున నీ చిన్నిసుతుని
సలుపలే దింక నిర్జరకోటి మెచ్చఁగా
నశ్వమేధాది యజ్ఞాదికముల
కన్న తలిదండ్రు లగు మాకు నిన్ని నీళ్లు
విడువవలసినపనిఁ గూడ నడుపలేదె
యిన్ని పను లున్నవే నీకు మన్నె తేఁడ!
యెందు కీజాడ? లేచి రా యందగాఁడ!

చంద్ర.—జీవితేశ్వరా! ఇంక నెక్కడి కొడుకు! మీరు ప్రాకృతులవలె శోకాంధకారంబున మునుంగఁదగదు. ముందు జరుగఁదగిన కుమారుని దహనవిధి కుపాయ మేదైన నున్నచోఁ బరికింపుఁడు. ప్రొద్దుపొడవకమున్న పోయి కంటి కగపడకున్న మా దొరసాని కాలకంటకియాజ్ఞ నుల్లంఘించినదాన నగుదును.

హరి.—దేవీ! నిర్భాగ్యుఁడనై చండాలదాస్యంబున బొట్టఁబోసికొను నేను నీకేయుపాయమున సహాయము చేయఁగలను? చెప్పుము,

ఉ॥ అందరి కెట్టివో స్వవిషయంబున కట్టివె కాటిచట్టముల్
నందనుఁడంచు వీనిఁ గరుణాగని యేలినవానియాన దీ

అందగవా సతీ! కనికరమ్మున కింత యెడమ్ములేదు, మా
డం దొరకీక యిప్పు డిచటన్ జతిఁ బేర్చుట కేను గర్తనే?

కావున నెట్లయిన మీదొరసాని నడిగి మాస్వామి కీయవలసిన మాడయు బాతయు సంపాదించుకొనిరమ్ము. ఇప్పుడు నాచేతనైన సహాయము నాకిందు రావలసిన పిండాశనము మానుకొనుట దక్క వేఱొండులేదు.

చంద్ర—హా! విధీ! యెంతవాని కెంతటి దురవస్థఁ దెచ్చిపెట్టితివి? నాథా! యిట్టి యిక్కట్టులందును మీరు ధర్మపథంబు దొలంగనందులకు నాకు సంతసమే కలుగుచున్నది. నేను మాదొరసానికడ కేగి మాడయు బాతయు నడిగెదను. ఆబిడ కా కాసంతదయగూడ కలుగకున్న విధి యెట్లు విధించెనో యట్లగుగాక!

హరి—శీఘ్రముగఁ బొమ్ము. అంతదనుకఁ గుఱ్ఱవాని కళేబరము నే చూచుచుండెద.

హరి—(కుమారుని ముందుంచుకొని) హా! హా! యెంతఘోరము సంభవించినది? కొడుకా! లోహితా! (చంద్రమతి నిష్క్రమించును)

మ॥ చతురంభోధిపరీతభూతధరణీసామ్రాజ్యసర్వస్వసం
తతధౌరేయుఁడ వయ్యు నీ వొకనియింటం గూటికై బంటవై
యతినైచ్యంబు వహించి దిక్కుసెడి యిల్లైనాఁడ వేమందు నీ
బ్రతు కీనాఁటికె తెల్లవాఱెఁగద పుత్రా! యిన్నిబన్నాలతోన్.

తండ్రీ! నీప్రాణమున కా కాలసర్ప మెక్కడ దాపరించెను? నిన్నుగన్న తల్లిదండ్రు లెన్నో దుఃఖంబు లనుభవింప రాళ్ళవలె బ్రతికియుండ నీవు దిక్కులేక యేకాకివై తుద కిట్లు దుర్మరణంబుపాలైతివే?

శా॥ నిన్నాపన్నగ ముగ్రతం గఱవఁ దండ్రిం దల్లినిన్ జీరి యే
మన్నావో, యపు డెంత బాధపడితో హా! పుత్రకా! నాకు నై
యెన్నోబన్నము లందినావు తుద కిట్లేకాకివై పోవ నేఁ
గన్నారం గననైతి నీయెడఁ గృతఘ్నత్వంబు వాటించితిన్.

ఇంక దుఃఖించి యేమి ప్రయోజనము? నీవు దీర్ఘాయుష్మంతుండ వగుదువని నుడివిన కాలజ్ఞులపల్కులే నిక్కువంబు లగునేని నీ కిన్ని కష్టంబులు రాకుండు. కాటి సున్నకై పోయినదేవి యింకను రాకున్నదేమి? తెల్లవారినదే! ఏమా కలకలము?

(తెరలోఁ గలకలము) ఓహో పురజనులారా! మనరాజుగారియింట దొంగతనముచేసి ధనాసచే రాచబిడ్డం జంపిన యీ శిశుహంత్రినిఁ దలఁగోయవలసినదిగా రాజాజ్ఞయైనది గనుక దీనిని వధ్యశిలయొద్దకిఁ దీసికొని పోవుచున్నాము.

హరి—(ఆకర్ణించి) రాజభటు లిక్కడకే వచ్చుచున్నారే.

భటు—(ప్రవేశించి) ఓయీ! వీరదాసూ! రాజు నాన మేర కీబాలహంత్రినిఁ దల నఱుక మీ వీరబాహు నీ కుత్తర మిచ్చినాఁడు. ఇదిగో నాతని యానవాలు. దీని నింకఁ దల నఱుకుము

హరి—(స్వగతము) ఏమిది! నాకన్నుల కేమైన భ్రమకల్గినా? నిక్కువముగానే చంద్రమతిని జూచుచున్నానా? ఈ శిశుహంత్రి చంద్రమతియా? (ప్రకాశముగా) అయ్యలారా! మీరు నేరస్థాపనయందుఁ బొరపాటు పడరుగదా! తిన్నగ నాలోచింపుఁడు.

భటు—ఏమోయీ! మహారాజుగారి యాజ్ఞకే యెదురుచెప్పుచున్నావు? నీ కీ యధిక ప్రసంగ మెందులకు? వెంటనే రాజాజ్ఞ నిర్వర్తింపుము. మే మింకఁబోవుచున్నాము

(నిష్క్రమింతురు)

హరి—(చంద్రమతిని సమీపించి దుఃఖముతో)

శా॥ హా! కాంతా! జగదేకపావనివి యీ ♦ యన్యాయ్యపున్నింద నీ
కా కల్పించుట రాజు నిర్దయుఁడె యో ♦ గ్యాయోగ్యములూన్నడఁడే
లోకంబంతయు నస్తమించెనె దయా ♦ ళుం డైన దేవుండు లేఁ
డే కాపాడఁగఁ గర్మసాక్షి పయి లేఁ ♦ డే సర్వముం జూడఁడే.

చంద్ర—నాథా! దుఃఖింపకుఁడు దైవము లేకేమి? నా పూర్వజన్మ సంచితపాపఫలంబున నిజమో, యబద్ధమో, కాశికాపురాధీశ్వరునిచే శాశ్వతమైన యీలాటినింద యారోపింపబడి స్వచ్ఛమైన నీకులంబునకెల్ల నొకకళంకంబు దెచ్చిన పాపాత్మురాల నైతి

హరి—ఏమీ! జగదేకపావనియగు నీయందే యొక నీచుడు నిందారోపణ మొనరించెగా? ఎట్లు?

చంద్ర—నాథా! అవధరింపుఁడు. అట్లుమీచే సెలవందికొని పోవుచుండ దారిలో నొక బాలశవము నాకాలికిఁ దగిలెను. అంత మతిచెలించినదాననై యాకళేబరము మన లోహితునిదేమోయని పరికించుచుండ యమకింకరులం బోలిన రాజభటు లచ్చోటికి వచ్చి "ఓసీ! పాపాత్మురాలా! గొంచబిడ్డ నేల చంపితివే" యని నగలమూట నొక దానిని నాయొడిం బడవైచి దొంగచిక్కెనని నన్నుఁ దన్నుచు రాజసాన్నిధ్యంబునకుం గొంపోవ నతఁడతికుపిత మనస్కుండై నాతల నఱుకుమని యాజ్ఞాపించె. ఇదియే నానిందకుఁ గారణము

హరి—అకటకటా! ధర్మమునకు నేఁటి కంతటి దుస్థితి సంభవించినది! తనచిత్తంబు మెప్పింపవలయునని సేవకు లెవ్వరిపైననో నేరమారోపించి తనయెదుట నిల్పినతోడనే న్యాయాన్యాయములు విచారింపకుండ నిరపరాధులగూడ సాపరాధులఁజేసి శిక్షించుచుండిన యిట్టిలాటి రాజులుండియేమి! మండియేమి! దేవీ! చంద్రమతీ! నేఁటితో మన యాశాబంధముగూడఁ దీరిపోయినది. నే నింక నాస్వామియాజ్ఞ నెఱవేర్పక

తప్పదుకదా! ఇదిగో! ఖండితులైన యపరాధుల రక్తపంకముచే నెఱ్ఱనైయున్న యీవధ్యశిల నీవింక నారోహింపుము. కులకాంతను నికొక్కనికి విక్రయించిన యీకృతఘ్నునకు స్త్రీహత్యాపాతకముగూడ రాదగ్గదే.

చంద్ర—(వధ్యశిల నారోహించి) నాథా! మీరింక నాకై చింతింపకుఁడు. మీరెఱుంగని ధర్మములు లేవుగదా. నన్ను జంపుటవలన సంభవింపఁగల పాపము నిరపరాధుల శిక్షించు నీ కాశికాపురాధీశ్వరుఁ జెందుఁ గానిఁ మి మ్మంటనేరదు. అదిగాక రాచబిడ్డను జంపితినను నీచమైన నిందమోసిన నేనింక బ్రతికిమాత్ర మేమి ప్రయోజనము? ఎక్కడనో నీచపుచావు చావకుండ నాజీవితేశ్వరులగు మీచే నేఁ చావఁగలిగినందులకు నేను బూజ్యురాలనే. మీరింక నిష్కళంకచిత్తమున మీసత్య నిరూఢి వేల్పులెల్లం బ్రశంసింప నాతలఁ ద్రుంచి మీస్వామియాజ్ఞ నెఱవేర్పుఁడు. ప్రాణపతీ! నాకడసారి వందన మందికొనుడు!

హరి—హా! హా! దుర్భరము, దుర్భరము. దేవీ! నీ వెంతచెప్పినను నా కూఱటజనించు టెట్లు?

సీ॥ నీవేకదా నాకు • నిఖిలేప్సితంబులఁ
గరగతంబు లొనర్చు • కల్పలతవు
నీవేకదా నాకు • నిత్యసత్యయశంబు
దరిఁజేర్చుచుండెడు • ధైర్యలక్ష్మి
నీవేకదా ఘోర • దావానలమునుండి
మమ్మురక్షించిన • మానవతివి
ఈవేకదా మాని • ఋణబాధఁ దొలగించి
పరువు నిల్పినయట్టి • భవ్యమతివి
గీ॥ నీవెకా నానిధానంబ • వీవె కావె
నాకులవిభూషణంబవు • నలిన నయన
అమరునే నాకు వేయి జ • న్మములకైన
నిన్నువంటి సతీమణి • నెలఁత మిన్న!

చంద్ర—నాథా! దుఃఖం బుపశమింపుఁడు.

హరి—ఇదిగో! నేను దుఃఖము విడిచి పెట్టినాడను.

గీ॥ మానినీమణి! గతమెల్ల • మరచిపొమ్మ
బదిలపఱుపు మేకాగ్రత • హృదయవృత్తి

భక్తిఁ గడసారి నా భగవంతుఁగూర్చి
నేత్రయుగ్మంబు మోడ్చి ధ్యానించుకొందు.

చంద్ర—పరమేశ్వరా! దీనబంధూ! దయాగుణ సనాధా! విశ్వనాధా!

మ॥ ఇదియే నాకడసారి ప్రార్థనము తండ్రీ! సర్వభూతేశ! నీ
సెద నే మోక్షపదంబుఁగోర నిఁక నెన్నే జన్మముల్ నాకునీ
నొదవంజేయుదు వన్ని జన్మముల కెల్లన్ నిత్యసత్యవ్రతుం
సదసత్కార్యవిచారధీరుని హరిశ్చంద్రుం బతిం జేయుమీ.

ప్రాణేశ్వరా! నేనీ జన్మమున నీ కొనరించు గడపటి నమస్కారమిదియే. ఇంక రాజాజ్ఞ నిర్వర్తింపుఁడు.

హరి—అహో! నానాటకంబునకు నిర్వహణసంధి నాభార్యావధావిధానంబుతో ముగియుచున్నదిగదా? అయ్యో! నేనెంత ఘోరపాతకుఁడను! పాలవంటి కులంబెల్ల నా కులంబొనరించి యొక్క చండాలుని దాస్యం బంగీకరించినది. చాలక శరణాగతులగు వారిపైనను స్త్రీజనంబుపైనను గృపాణమెత్తక రక్షింతుననునా ప్రతిజ్ఞఁగూడ భంగము గావింపఁ జేపట్టిన కులకాంతను నిరుపమాన పతివ్రతా లలామను జేతులారఁ దలఁగోయ సాహసించుచున్నాను. అయ్యో! స్వామియగు వీరబాహునన్నే యీ కార్యంబునకేల నియమింపవలయును? తానే రాజాజ్ఞ నిర్వర్తించిన నాకింత సంతాపము లేకుండుఁ గదా! దైవమా యిన్నిదుఃఖములతో నన్నింతకాలము బ్రతుక నిచ్చిన దిట్టి స్త్రీహత్యాపాతక మొడికట్టుటకా? కటకటా! భూదేవీ! స్త్రీహత్యకుఁ గూడఁ బాల్పడిన యీచండాలుని ప్రాణంబులఁ బోకార్చి నీభారము కొంత తగ్గించుకొనరాదా? భగవానుఁడా! లోకబాంధవా! నీవంశమెల్ల నిట్లపకీర్తిపాలు చేయుచున్న యీ నీచహరిశ్చంద్రుని నీసహస్రకిరణంబులచేత భస్మీభూతునిఁజేయ లేవా? మునిజనగరిష్ఠా! వసిష్ఠా! ఈనీశిష్యుని పాపకర్మంబులఁ గన్నారఁ జూచుచుండియుఁ బ్రళయకాలనిర్ఘాతసమమైన నీశాపవాక్కును విడువకున్నావేమి? ఛీ! ఛీ! దక్షిణహస్తమా! నీవు దినక్రమమున నీసుకృతములన్నియు మంటగల్పికొని తుద కేమి కానున్నావు?

ఉ॥ కమ్మనియూలనేతమునుఁ గట్టి నవనాగ్నిని దృప్తిసేయు పు
ణ్యమ్ము నగ మ్మణంగె మన నమ్ముసఁ బీనుఁగు లంటుటన్ వివా
హమ్మున నీసతిన్ విడువ నంచు స్పృశించితొ తచ్ఛిరమ్మునా
కొమ్మను జంప నానగము గూడ నశింపదె పాపిహస్తమా!

ఖడ్గమా! నీవెంతయపకృతికి బాల్పడుచుంటివి!

చ॥ విడిచితిరాజ్యమైన పర • విం గులకాంతను నైనఁ గన్నయీ
కొడుకును నైన నిన్ను నను • గుంగతి జూచితిగాని ఖడ్గమా!
కడకిటు వల్ల కాటి కధి • కారము వచ్చినయప్పుడైన నీ
విడువని యాకృతజ్ఞతయు • వీడి వధింతువె నాసతీమణిన్?

ఛీ! ఏమి, నామతి చాంచల్యము? పవిత్రమైన సత్యవ్రతరక్షణార్థము నే నిప్పుడెంత సాహసమైన నాచరింపవలసినదే. గావున,

సీ॥ హృదయమా! సతికి నా • ఋణమెల్ల సరిపోయె
నీకేటియూన యీ • నెలఁతపైన
మోహమా! నీకాల • ము గతించె మాచెంత
బ్రతుకు మెం దేని • దంపతులపొంత
దుఃఖమా! నీవున్న • దోసగు తప్పదు మాకుఁ
దొలఁగి పొమ్మింక నా • తలపు వీడి
ఖడ్గమా! మానినీ • కంఠరక్తముగూడ
జవిచూడఁగలవు ని • శ్చలత గొనుము
గీ॥ సత్యమునకయి యీహరి • శ్చంద్రువంశ
మంతరించెడుఁగాక శ్రీ • హరునిమీఁద
మనసు గుఱిఁ జేసి హా! చంద్ర•మతి! త్వదీయ
కంఠమర్పింపు నీపతి • ఖడ్గమునకు.

[అని కత్తినెత్తగా హఠాత్తుగా విశ్వామిత్రుఁడు ప్రవేశించి నివారించి]

భళి! భళిరే! హరిశ్చంద్రా! చాలుఁ జాలు నీ సాహసకర్మంబు. ఛీ! ఛీ! నీవెక్కడనో రాకాశికి జన్మింపవలసినవాఁడవు. నీముఖముజూచిన దురితము. విపత్తుశిక్షాదక్షంబగు నీకాక్షేయము నేఁటి కీలాటి లతాతన్వుల జంప సిద్ధపడెఁగా? "అఱునెలలు సాముజేసి మూలనున్న ముసలమ్మ నోడించి" నట్లు నీ భుజబలం బీలాగున గుసుమకోమలులం జంపుటకు నక్కఱకు వచ్చెనుగా? నీకులగురుండగు వసిష్ఠుండు నీకు ధనుర్వేదము నేర్పిన దిందుకేనా? జగద్వంద్యమగు సూర్యవంశంబునం బుట్టిమా వంటివారి కాళ్లు దలవంపులగునట్లొక్క చండాలుని దాస్యంబునకుఁ జొచ్చుటచాల

స్త్రీహత్యకుం గూడఁ బాల్పడితివిగా? దుర్మార్గుఁడా! సముంచితసాధ్వీమతల్లి యగు నీయిల్లాలిం జంపి నీ వింక నేస్వర్గరాజ్య మేలఁ దలంచితివి? ఇప్పటికైన నా మాట విని సౌందర్యసీమ లగునా ముద్దుకూతులం బరిణయంబగుము. నీ దారాపుత్రుల ప్రాణదానంబును, రాజ్యప్రదానంబు ననుగ్రహించెద వినుము. నావాక్యము లమృతోపమానములు సుమీ!

హ—(నవ్వి) గాధేయా! ఈనీతులు నా కవసరములేదు గాని మీ రింక నిక్కడ నుండి తొలఁగిపొండు, నా పూనిక మాన్ప నింక మీతరము కాదు! పొండు. పొండు

విశ్వా—కాని నీ వనుభవించెదవు. (స్వగతము) నే నిప్పు డేమి సేయుదును?

హరి—దేవీ! ఇఁక సిద్ధముగా నుండుము.

విశ్వా—[తత్తరముతో] హరిశ్చంద్రా! ఈపాటికి శాంతింపుము. నీ గురువే జయించెను. నేనే యోడితి

హ—అయ్యా! మీమాటలు నా కర్థము కావు గురువేమో జయమేమో నే నెఱుంగను. పొం డావలకు.

విశ్వా—(దిక్కులకు పరుగెత్తుచు) నక్షత్రకా! నే నిప్పు డేమి సేయుదునురా ఓ దేవేంద్రా! మీరైన హరిశ్చంద్రుని వారింపుఁడు. హరిశ్చంద్రా! శాంతింపుము.

శా॥ సత్య శ్రీనిధివైతి నీ గురు ప్రతి, జ్ఞావాక్యము ల్సెల్లె స్త్రీ
హత్యా దోషముఁ గట్టికోకు మిపు డా, ర్యా భర్త విశ్వేశుండే
ప్రత్యక్షంబగు నీదు దేశికునితోఁ, బాలింపుమా నన్నుఁ బ్రా
ణత్యాగం బొనరింతు లేనియెడ న, న్యాయంబుగా నీకునై.

[మరల దిక్కులకు బరువెత్తుచు]

శా॥ వేరంబుల్ దిగ ద్రింగి కాళ్ళ బడినన్, వేధింతువేమీ వసి
ష్ఠా! రా యిప్పుడు పెండ్లివారి నడక, ల్సాగింపకయ్యా! మహేం
ద్రా! రాజిప్పటికే తెగించి తన కా, ర్యం బెల్ల సగ్గించె నే
మో రా రండిఁక జచ్చుదాక బిగియిం, పుట్టాడ వెవ్వారికిన్.

ఓ కాశీ విశ్వనాథా! నీవైన నీ రాజేంద్రుని వారింపుము.

[పార్వతీ సహితుండై పరమేశ్వరుం డింద్ర వసిష్ఠులతోఁ బ్రవేశించును.]

పర—శా॥ శాంతింపుము త్రిశంకు నందన! హరి, శ్చంద్రా! భవత్సత్యవి
క్రాంతిన్ మెచ్చితి, వచ్చితిన్ వరములన్ గై సేయ నీ సద్యశ

స్సంతానంబులు వియ్యమంది సకలా • శాదంతి దంత ప్రభా
సంతానంబులతో నిరంతరము పి • శ్వ స్తవ్యమై క్రాలెడిన్.

హరి—[ప్రాంజలియై] మానినీ వృత్తము

జయ జయ సురగంగా • సంగత స్వోత్తమాంగా!
జయ శరధినిషంగా! • శైలజాతాభిషంగా!
జయ వృషభతురంగా! • సాధు చిత్తాబ్జభృంగా!
జయ జయ ధవళాంగా! • సంతతానంద సంగా!

మహాత్మా! గిరీశా! నమస్కారము. మహేంద్రా! వందనము. గురూత్తమా! అభివాదము.

వసి—వత్సా! హరిశ్చంద్రా! నీ యెడఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుండయ్యె. నీ కింకఁ గష్టములు తొలగినవి.

పార్వ—చంద్రమతీ! పతివ్రతా తిలకంబగు నీచే లోకంబంతయుఁ బవిత్రమైనది. నీకేమి వరములు కావలయునో కోరుము.

చంద్ర—అమ్మా! మీరు ప్రసన్నతం జెందిన నీయరాని దేమున్నది? చనిపోయిన రాచ బిడ్డం బ్రతికించి నా యపవాదంబుఁ బాపుము.

పార్వ—సాధ్వీమణీ! నీ ధర్మ గుణంబునకు మెచ్చితి. రాచబిడ్డతోఁ గూడ నీ కుమారుఁడును, సజీవుండగు గాక! లోహితాస్యా! లేచిరమ్మ. [లేవనెత్తును]

[తల్లిదండ్రులు కాఁగలించికొందురు.]

లోహి—మిత్రులారా! నేఁ గోసిన కుశలెక్కడ?

వర—కుట్టా! నీ గురువునకుఁ జేరినవి. తొందర పడకుము. హరిశ్చంద్రా! నీవింక నీ రాజధానికిఁబోయి పట్టభద్రుఁడ వగుము.

హరి—అయ్యో! చండాల దాసుఁడనైన నా కింక రాజ్య మెందులకు? మీ దర్శన భాగ్యము లభించెఁ జాలదే?

విశ్వా—హరిశ్చంద్రా! సత్య వ్రతంబుఁ బరీక్షింప నేనే నీ కిన్ని కష్టంబులఁ దెచ్చిపెట్టితిని. ఇది యంతయు నాయీ కల్పితము చూడు,

గీ॥ కడకు నిను దాసునిగఁ గొన్న • కాటి తేఁడు
పరశుముఁడుగాని కడజాతి • వాఁడు గాఁడు
ఇపుడు నీవు వసించెడు • నిప్పాలంబు
సవనవాటంబు గాని మ • సనము గాదు.

మఱియు, క॥ పనిక త్తెగ నీ వనితం
గొని నాతఁడు బాలచంద్ర ♦ కోటీరుఁడు గాక
నిజముగా విప్రుఁడు గాఁ
డంఘూ! హరసేవ దొరకు ♦ నా యన్యులకున్.

కావున మరల నీ రాజ్యము నీవు గ్రహించి నన్నుఁ జరితార్థునిఁ జేయుము.

వసి—వత్సా! యీ విశ్వామిత్రుని ప్రార్థన మంగీకరింపుము:

హరి—గురూత్తమా! యిమ్మహనీయుఁడు నన్నుఁ బ్రార్థింప వలయునా?

పర—విశ్వామిత్రా! నీచేతితోఁ గిరీట మాతని శిరం బలంకరింపుము.

దేవే—గాధేయా! నాఁడు సభలో సకల మునిగణంబుల సమక్షమునఁ జేసిన ప్రతిజ్ఞం జెల్లించుట కిదియే యదను. గావున నీ పరమేశ్వరు నాజ్ఞ శిరసా వహించి నిత్య సత్యవ్రతుండగు నీ హరిశ్చంద్ర చక్రవర్తి నీ చేతులార బట్టాభిషిక్తుం జేసి నీ తప శ్శక్తి యంతయును ధారపోయుము.

విశ్వా—[అట్లుచేసి] ఇదిగో నాతపశ్శక్తి యంతయు నీకే ధారవోయ చున్నాను పరిగ్రహింపుము.

వసి—విశ్వామిత్రా! యిప్పటి కయిన నెవరు గెల్చిరో చెప్పుము.

విశ్వా—చాలు చాలు. విశ్వామిత్రుఁడు నీ కోడెనని తలంచు చున్నావు కాఁబోలు. సాటి రాచబిడ్డఁడగు మా హరిశ్చంద్రుని సత్య యశంబుఁ బ్రకటింప నుద్దేశించి సఫలీకృత మనోరథుండ నగు నాకుఁ బరాజయ మెక్కడిది? యిన్ని కష్టములు పడ కున్న నితని కీర్తి లోకమున కెట్లు వెల్లడి యగును! —

హరి—నిజము, ఇమ్మహనీయుని వచనంబులు యదార్థములు. చూడుఁడు.

గీ॥ కఱగినను గాని పసిఁడికి ♦ గాంతిరాదు
దఱచినను గాని పాలఁ జే ♦ కురదు వెన్న
యొఱచినను గాని మణికైన ♦ నొఱపురాదు
ఇడుమలను గాని నరున కే ♦ ర్పడదు కీర్తి,

దేవే—విశ్వామిత్రా! నాఁడు నేను సభలో

గీ॥ సరసులగు పండితుల విమ ♦ ర్శనము లెల్ల
గడచినదె కద నిర్దుష్ట ♦ కావ్య మగును
తన కళత్రి సుత ప్రాణ ♦ ధనము లడఁగు
సమయమున నిల్చియున్నదే ♦ సత్య నిష్ఠ.

అని వక్కాణించిన దిందుకే.

పర — హరిశ్చంద్రా! నీ కింకేమి కావలయు?

హరి — దేవా! నే నింకఁ గోరఁదగిన దేమున్నది?

మ. తనయుండా త్తనయుండు దుర్విష లస • ద్దర్వీవర గ్రస్తుఁడై
మనియెన్ జెట్టునకొక్క పక్షిగతి సం • సారంబు నిర్భిన్నమై
చనినన్ జేరితి నాలు బిడ్డల. నికృ • ష్టంబైన దాస్యంబు వా
సె. ననిర్వాచ్యసుఖంబు దక్కె, నశేయిం • చెన్ దుష్టనిందావళుల్.

అయిన దేవర ప్రసన్నతం జెందిరి గాన నిట్లగుఁ గాక!

మంగళమహాశ్రీవృత్తము

శ్రీలెసఁగ ధారుణిన • శేష మగుపంటలు వి • శేషముగఁ బండెడిధరిత్రీ
పాలకులురాష్ట్రములఁ • బాడిమెయి నేలుదుర • పారకరుణారససమృద్ధిన్
జాలగవసుంధర న • సత్యమునశించును • సత్యమెజయంబువహియించున్
ధీలలితులై నకవి • ధీరుల యభీష్టములఁ • దీర్చెదరుగాత నృపమౌళుల్.

పర — తథాస్తు. [అందరు నిష్క్రమింతురు.]

గద్య

ఇది హారితస గోత్ర పవిత్ర నృసింహ మనీషి వర పుత్ర బుధ
జన విధేయ లక్ష్మీకాంత నామధేయ ప్రణీతంబైన
శ్రీ సత్య హరిశ్చంద్రీయ నాటకంబున
సర్వంబును సంపూర్ణము.



బెజవాడ శ్రీ శారదా ముద్రణాలయందు ముద్రింపఁబడియె — 1000 ప్రతులు

## బెజవాడ సరస్వతీ బుక్‌డిపో వారి స్వంత ప్రచురణములు.

### బ్ర॥ ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచియింపబడిన హరికథలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | జానకీశపథము | 1-0 | 5 | భీష్మచరిత్ర | 0-8 |
| 2 | రుక్మిణీకల్యాణము | 0-12 | 6 | అంబరీషచరిత్ర | 0-8 |
| 3 | హరిశ్చంద్రోపాఖ్యానము | 0-12 | 7 | గజేంద్రమోక్షము | 0-8 |
| 4 | మార్కండేయోపాఖ్యానము | 0-12 | 8 | ప్రహ్లాదచరిత్ర | 0-8 |

పై ఎనిమిదిపుస్తకములు కలిసిన క్యాలికో బైండు రు 5-8-0

### బి. బాలాజీదాసుగారిచే రచియింపఁబడిన హరికథలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సంపూర్ణరామాయణము | 1-0 | 9 | శశిరేఖాపరిణయము | 0-6 |
| 2 | కుశలవ విజయం | 0-6 | 10 | దయాకరవిజయము | 0-6 |
| 3 | గయోపాఖ్యానము | 0-6 | 11 | ద్రౌపదీ మానసంరక్షణము | 0-4 |
| 4 | జయప్రద లేక పురూరవ | 0-6 | 12 | పురందరదాసు చరిత్రము | 0-4 |
| 5 | త్రిశంకు విజయము లేక హరిశ్చంద్ర | 0-6 | 13 | సూరదాసు చరిత్రము | 0-4 |
| 6 | నలచరిత్రము | 0-6 | 14 | కుచేలోపాఖ్యానము | 0-4 |
| 7 | సీతాకల్యాణము | 0-6 | 15 | హరికథేతిహాసమంజరి మొదటిభాగం [పద్యములు] | 0-4 |
| 8 | రుక్మాంగద లేక ఏకాదశీ మహాత్మ్యము | 0-6 | 16 | డిటో 2వ భాగం [కీర్తనలు] | 0-4 |
| | | | 17 | కర్ణానందదాయిని [పద్యములు] | 0-4 |

### చల్లా రామలింగయ్యగారి విరచితము

భద్రాచలరామదాసు చరిత్ర 0-4-0

### శ్రీమాన్ తిరునగరి శేషదాసుగారి హరికథలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | శ్రీరామపాదుక | 0-8 | 4 | శ్రీమదుత్తరరామ చరితము | 0-8 |
| 2 | సీతాకల్యాణము | 0-8 | 5 | సుభద్రాపరిణయము | 0-8 |
| 3 | సీతాపహరణము | 0-8 | 6 | సమయోచిత పద్యరత్నావళి | 0 6 |

వలయువారు:—కురుకూరి సుబ్బారావు అండ్ సన్,

ప్రొప్రయిటర్సు, సరస్వతీ బుక్‌డిపో., బెజవాడ (కృష్ణాజిల్లా)

— రాజమండ్రి.

# బుద్ధిమతీవిలాసము

(గ్రంథకర్త:— బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు)

విష్ణుభక్తులలో బాలభక్తుఁడై విఖ్యాతినందిన ప్రహ్లాదునివలెనే శివభక్తులలో బాలభక్తుఁడైన జగద్విఖ్యాతిమంతుఁడు మతిమంతుఁడు! మతిమంతుఁడు పదియేండ్ల బాల్యమునందే పటుతరశివభక్తిస్థిరత్వమును ప్రకటించినాఁడు. 'నిన్ను నీ తండ్రి దయారహితుఁడై చంపి యొక సన్న్యాసికి భోజనముగా నిడనున్నాఁడు. పారిపొ'మ్మని తనకు నీతి బోధ జేసిన భృంగికి వైరాగ్యములు బోధించినాఁడు. తన యకాలమరణము నకై తల్లడిల్లు తలిదండ్రుల నోదార్చి నిర్భీతితో మృత్యువు నెదిర్చి నిలిచినాఁడు. యతిరూపమును దాల్చి మతిమంతుని తలిదండ్రులగు బుద్ధిమతీ సిరియాళ రాజేంద్రులను శోధించిన శ్రీ సదాశివుని యార్భాట మత్యంతభయానకము. కథానాయిక యగు బుద్ధిమతీదేవి యొక్క పాతివ్రత్యము సతీమణుల కాదర్శప్రాయమయి యున్నది. కథానాయకుఁడగు సిరియాళరాజేంద్రుని నిత్యసత్యసంధత - శివభక్తి - అతిథిసత్కార దీక్ష - వైరాగ్యప్రవృత్తి - సమస్త భూలోకమానవులకు అవశ్యానుసరణీయములు. బుద్ధిమతీదేవి గర్భవాసమున నవమాసములు మోసి కనిన వంశైకప్రదీపకుఁ డగు నేకపుత్రుని, ఒక యతినాథునకు - బాలకమాంసాకాంక్షి యగు నొక సన్న్యాసికి బలిగా నిచ్చుటకు రవంతయైన నెనుదీయని మహాసాధ్వీమతల్లి, భర్తయభిమతమే తనయభిమతముగా నెంచి యతిథి పూజచేసిన యతిలోకవిఖ్యాత యగు పతివ్రతాశిరోరత్నము. బుద్ధిమతీ సిరియాళమహారాజులయొక్కయు, మతిమంతునియొక్కయు శివభక్తికిని - అతిథిపూజా పరతంత్రతకును మెచ్చి పార్వతీపరమేశ్వరులు నిజరూపములతో సాక్షాత్కరించి, వరప్రదానము గావించిన భక్తిరస పూరితమగు దివ్యచరిత్రము. అమృతము లొలుకు పద్యములు. అద్భుతములగు గద్యములు, ఆంధ్రరంగస్థలములం దనేకమారులు ప్రదర్శింపఁబడి, లోకాతీతసత్కీర్తి గాంచిన నాటకరాజము. వెల రు 1—0—0

---

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.